శ్రీ

# భారతసారము

ఇది

కాశీనాథుని వీరమల్లయారాధ్య

విరచితము.

పబ్లిషర్సు:

రామా అండ్ కో

ఏలూరు.

త్రిపుర సుందరీ ముద్రాక్షరశాల, తెనాలి.

1928

 [వెల 0—10—0

# సంపాదకీయ భూమిక

సత్య సమన్వితులు, యశోధనులు,
ములు, ధర్మపరులు, కృతజ్ఞులు, ఉత్తములు,
కంపనులగు భారతవీరుల సద్గుణములను గీర్తిం
ము విద్యార్థులకు నుపయుక్తముగ నుండునని
వ్రాయ నవసరము లేదు. బాలుర భాషాజ్ఞాన
దును. సద్గుణము లలవడును. దేశాభిమానము

భారతకథను సులభశైలిని దెలిపెడు
నెల్ల దీని కగ్రస్థాన మియ్యవచ్చునని మాయభి

పరీక్షాధికారులును, యుపాధ్యాయులును
మును పరిశీలించి ఏడవతరగతికి పఠనీయ గ్రం
మించెదరు గాక.

15-12-18 } వలివేటి శాయన్న
సైదాపేట. } యం. ఏ. ఎ

GENTLEMAN,

I have carefully gone through the book "Bharata Saram" which you had kindly sent me.

I am of opinion that the book Bharata Saram suitable for High School classes.

I suggest that a page of contents be added the beginning of the book as an appendix of brief tes at the end, in the next edition, to make the ok more useful for lay men too.

I am very much pleased with the style of the ok.

I am,
Sincerely Yours,
G. R. DEEKSHITULU,
Telugu Teacher.

E. L. M. College,
Guntur 23—8—18.

IV

SIRS,

"Bharatha Saram" is strictly the Boys own book. In it is a great story told in a little way. The language is chaste and simple the method logical and clean. As for the teachings of the great Epic the best of them are in all places worked nicely and well into the stories. I trust the book will supply. a real need in the Telugu School world.

Guntur, K. KRISHNA SOMAYAJI. M. A
14-9-18. Lecturer. A. E. L. M. College.
Guntur.

---

V

SIRS,

I have gone through your two publications RAMAYANA SARAM & BHARATA SARAM which are written in an easy flowing style. I wish these two books may be of immense use to the students as well as to the public at large.

ELLORE. P VENKATASUBBAIAH,
M. A., & B. L.,
19—2—19. Vakil.

---

# అభిప్రాయములు

చక్కని పద్యములు చేర్చి రామాయణ కథను సులభ శైలిలో క్రిందితరగతి బాలుర యుపయోగార్థమై రామాయణ సారమను పేర నిదివరకే వ్రాసిన శ్రీ కాశీనాథుని వీరమల్లయ్యగారిపుడు "భారతసార" మను పేరుతో నొకమంచి పుస్తకమును వ్రాసిరి. దీనియందు గ్రంథరాజమగు భారతమందలి కథమృదు మధుర శైలిలో వచనమునఁ జెప్పఁబడినది. హృద్యములగు పద్యములు గూడ నిందు బొందుపఱుపఁ బడినవి. ఈపుస్తకము ఏడవతరగతి బాలురకుఁ బఠనీయగ్రంథముగ నియమింప వచ్చును.

గుంటూరు,
22-12-18.

రాయసము వెంకటశివుఁడు
ఎం. ఏ. ఎల్. టి.

మీరు అత్యంతదయతో పంపిన "రామాయణసారము" "భారత సారము" అను చిన్న గ్రంథములను సాంతముగాఁజదివి మిక్కిలి ఆనందించితిని. మహాకావ్యములయందలి కథాచమత్కారమును నీతిబోధక విషయములను జక్కగానిమిడ్చి వచన రచనఁ జేసిన శ్రీ కాశీనాథుని వీరమల్లయ్యగారిని మిక్కిలి యభినందించుచున్నాను. తెలుఁగు పద్యకావ్యముల నన్నిటిని ఈ విధముగా చిన్న వచనగ్రంథములుగా రచించి భాషాసేవచేయుదురుగాక యని కోరుచున్నాను.

ఇట్లు విధేయుఁడు,

గుంటూరు,
27-9-18

మం. సాంబశివరావు
బి. ఏ. ఎల్. టి.

# విషయసూచిక.

## 1. ఆది పర్వము.



## 2. సభా పర్వము.

## 3. ఆరణ్యపర్వము.



## 4. విరాట్పర్వము.



## 5. ఉద్యోగ పర్వము.

## 6. భీష్మపర్వము.



## 7. ద్రోణపర్వము.



## 8. కర్ణ పర్వము.



## 9. శల్య పర్వము.



## 10. సౌప్తికపర్వము.

## 11. స్త్రీపర్వము.



## 12. శాంతిపర్వము.



## 13. అనుశాసనికపర్వము.



## 14. అశ్వమేధ పర్వము.

## 15. ఆశ్రమవాస పర్వము.



## 17. మహాప్రస్థానిక పర్వము.



## 18. స్వర్గారోహణ పర్వము.

# ఉపోద్ఘాతము

ఆంధ్రమున మనకు వెలసియున్న మహాప్రబంధములలో భారతము ఇహపర ధర్మబోధకమైనది. అందు ఆబాల వృద్ధ పర్యంతము గమనింపఁదగిన నీతు లనేక రీతుల నెలకొని యున్నవి. సమస్త స్త్రీ పురుషప్రవర్తన క్రమము లన్నియును వానివలనఁ గలుగు లాభ నష్టములన్నియును, నీ గ్రంథము వలన నుదోబోధింపఁబడు చున్నవి. కాని మహా చరిత్రాత్మక గ్రంథమగుటచేతను, లక్షణ నిరూపణ గ్రంథ మగుటచేతను, భాషాకాఠిన్య కవితా శైలి నుండుటచేతను, విద్యార్థులకు దుర వగాహమైయున్నది. ఇందలి నీతిరత్నములును, మహా పురుష లక్షణములును యువజన కోమల మానసములందు లగించెనేని విద్యార్థిజనులకు యోగ్య లక్షణము లబ్బు ననుట నిర్వివా దాంశము.

అందుచేత భారతమంతయు స్థనశల్యపరీక్షగాఁ బరిశీ లించి, నీతిభాగముల నేటి బాలురకు భారతకథ సంగ్రహ ముగాఁ దెలియునట్లును, నీతిరత్నములు సుబోధకముగా నమ రునట్లును ఒక తరగతిలోనే పూర్ణముగాఁ జదువుట కర్హ మగు నట్లును, 144 పుటలలో నీ ‘ భారతసార ’ మను గ్రంథమును గద్యకావ్యముగా రచించుచు భారతమందలి రసవత్తమము లగు పద్యములఁ గొన్నిటి నందందు సందర్భాను సారముగ నిమిడ్చితిని. ఇందలి భాషాశైలి ‘ ఏడవతరగతి బాలుర కనుగుణముగ నున్న ’ దని కృష్ణాజిల్లా స్కూళ్ళ అసిస్టెంటు

ఇన్‌స్పెక్టరుగారును మఱియుఁ బెక్కురు విద్యాధికారులును, సెలవిచ్చియున్నారు. వ్రాయునప్పుడు మా మతమునంతియే. గ్రంథములోని కఠినపదములకు గ్రంథాంతమున నర్థములుగూడ ముద్రించితిమి.

సెకండరీ పాఠశాలల యుపాధ్యాయులీ పాఠకగ్రంథమును బరిశీలించి విద్యార్థుల కుపయోగించి కృతినిఁ బ్రోత్సహింతురని కోరుచున్నాను. 5, 6 తరగతుల బాలుర కుపయుక్తము లగునటుల "రామాయణసారము, కథారామాయణము" లను గ్రంథములను గూడ నిదివఱకే ప్రచురించియుంటిని. ఇవియన్నియు రామా అండ్ కంపెనీవారి యధీనమున నున్నవి. వలయువారు వ్రాసి తెప్పించుకొన నగును.

ఈ మహా ప్రబంధమును సంస్కృతము నుండి తొలుదొల్త మన యాంధ్రమున నెలకొల్పిన నన్నయభట్టారక, తిక్కనామాత్య, ఎఱ్ఱనామాత్య, మహాకవులీ యాంధ్ర ప్రపంచమునకు నిత్య వందనీయులు.

ఇట్లు,

ఏలూరు, కాశీనాథుని వీరమల్లయ్య.

1—7—18. గ్రంథకర్త

———: (o) :———

అవిఘ్నమస్తు.

# భారతసారము.

## ఆదిపర్వము.

### భారత వంశము.

శంతనుఁడు కురుపాండవ వంశములకు మూలపురుషుఁడు. కురుపాండవులయొక్క చరిత్రమే భారత కథయై యున్నది. శంతనుఁడు మహా ప్రతాపశాలియు। నతి సౌందర్యవంతుఁడునగు నొక క్షత్రియుఁడు. ఈతనికి గంగాదేవి మొదటి భార్యయై యతనితో గొంతకాలము కాపురము సేసి యెనమండ్రు కొడుకులను బడసెను. వారిలో మొదటి యేడ్వురినిఁ బుట్టువుతోడనే నదీపాతము జేసెను. ఎనిమిదవ వాఁడు భీష్ముఁడు. ఇతఁడు గొప్ప పండితుఁడు, మిగుల బలవంతుఁడు, సత్యవ్రతుఁడు. పరాక్రమమున నితనికి సమానుఁడు మూఁడుజగంబులను లేఁడు. పరశురామునియొద్ద విలువిద్య నభ్యసించెను. భీష్ముఁడు పుట్టినతోడనే గంగాదేవి శంతనుని విడిచిపోయెను.

శంతనునకు మరల వివాహము సేసికొనవలయునని బుద్ధిపుట్టినది. సత్యవతియను దాశరాజుకుమార్తెను వరించి "యాకన్నియను దనకి" మ్మని శంతనుడు దాశరాజు నడిగెను. "సత్యవతికి బుట్టిన పిల్లలకు రాజ్యము నిచ్చునటుల వాగ్దానము సేసిన యెడల నిచ్చెద" నని దాశరాజు సెప్పెను. జ్యేష్ఠకుమారుఁడగు భీష్ముఁడుండగా రాజ్యమును గనిష్ఠులకిచ్చుట కిష్టపడక శంతనుఁడు నిజగృహమునకు వచ్చి విచారముతోఁ బరుండెను. భీష్ముఁడు తండ్రి విచారకారణమును తెలిసికొని సత్యవతిని దెచ్చి వివాహము సేయుఁదలంచెను.

## సత్యవతీ చరిత్రము.

అద్రికయను నప్సరస బ్రహ్మశాపమున నొక మత్స్యమయ్యెను. 'దాశరా' జను జాలరిఱేఁడు తన సేవకులచేతఁ జేపలను బట్టించుచుండఁగా నీ మత్స్యము దొఱకెను. సేవకులా జేఁపను రాజుకడకుఁగొనివచ్చిరి. రాజా మత్స్యమును జీల్చి చూడ నందు గన్యకయు బాలుఁడును గనబడిరి. ఆకన్యకకు "సత్యవతి" యని నామకరణంబు సేసెను. చేఁప కడుపులోనుండి వెలువడుట చేత నాకన్యక యొడలంతయుఁ జేఁపల కంపు కొట్టుచుండెను. అందువలన నామెకు "మత్స్యగంధి" యనియుఁ బేరు గలిగెను. ఆ బాలికకు యౌవనము సంప్రాప్తమైనపుడు కూడ దాశరాజామెకు యమునానది మీఁద జనుల దాటించుట కుంచఁబడిన పడవ నడుపుచుండు

పని నియోగించెను. ఒకనాఁడు పరాశరుఁడు యాత్రార్థియై పోవుచు యమునానదిని దాటుటకుఁ బడవనెక్కెను. ఆయన మహాముని యైనను సత్యవతి నెంటరిగా జూచుటచేతఁ బ్రేమించెను. యొడలికి పరిమళగంధమును గల్పించెను. మహాముని ప్రసాదమున సత్యవతికి వ్యాసుఁడు పుట్టెను. ఆపె కన్యాత్వమునకు భంగము రాకుండునట్లు పరాశరుఁడు వరమిచ్చినందున నామె కన్యకగానే యుండెను. మత్స్యగంధి యొడలి పరిమళము యోజనమువఱకు వ్యాపించుచుండినందున నామెకు "యోజనగంధి" యనియుఁ బేరువచ్చెను. ఆసత్యవతినే శంతనుఁడు వరించినది. ఆమెకు మునికృపవలన బుట్టిన వ్యాసుఁడే యీ భారతప్రబంధమును మొదట సంస్కృతమున రచియించెను.

## భీష్ముఁడు సత్యవతిని గొనివచ్చుట.

భీష్ముఁడు దాశరాజు నొద్దకుఁ బోయి "సత్యవతినిఁ దనతండ్రి కిచ్చి వివాహముసేయు" మని యడిగెను. "పరాక్రమవంతుఁడగు భీష్ముఁ డేమిసేయునో" యని భయమునంది దాశరాజు వవినయముగా గాంగేయునితో నిట్లులవియెను. "గాంగేయా! సత్యవతీపుత్రులకు రాజ్యము నొసంగు వానికి నామె నిచ్చి వివాహముసేయుటకు నిశ్చయించుకొంటిని. నీవు నాకోరికను దీర్పఁగలుగుదు వేని నీ కోరినట్లు సత్యవతిని శంత

నున కొసంగెద" నని చెప్పెను. భీష్ముఁ డందుల కొప్పికొని యచ్చటి వారందఱు వినుచుండ నిట్లు శపథము గావించెను.

చ. "వినుఁడు, ప్రసిద్ధులైన, పృథివీపతులందఱు, నేఁగురుప్రయో
జనమునఁ, జేసితి, న్సమయసంస్థితి, యీలలితాంగి, కుద్భవిం
చిన తనయుండు రాజ్యమును జేయఁగనర్హుఁడు, వాఁడ, మాకునె
ల్లను బతి, వాఁడ, కౌరవకులస్థితికారుఁ, డుదారసంపదన్."

అని సభాస్తారు లచ్చెరువందునట్లు భీష్ముండు శపథము గావించెను. జాలరిఱేఁ డాతని పలుకులు విని "గంగనందనా! నీ పితృభక్తికిఁ గడు మెచ్చితిని. కాని నీ యట్లె నీ తనయులు సమ్మతింపక భిన్నక్రియ నాచరింతు రేమో యని సంశయించెద" ననెను. భీష్ముఁ డా దాశరాజు సంశయమును బోఁగొట్టుటకు నతిధైర్యముతో నిట్టులనియెను.

క. "ధృతిబూని బ్రహ్మచర్య
వ్రత మున్నతిఁ దాల్చితినిఁ ధ్రువంబుగ ననప
త్యత నైనను లోకము లా
యతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యములై."

అని ఘోరమగు శపథమును మరల గావించి గాంగేయుఁడు సత్యవతినిఁ దెచ్చి శంతనునకు వివాహము సేసెను. శంతనుఁడు భీష్ముని పితృభక్తికి మెచ్చి యతనికి స్వచ్ఛందమరణంబుగా వరంబిచ్చి సత్యవతియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యు

లను నిద్దఱు కొడుకులం బడసి వారు యుక్తవయస్కులు గాక ముందు పరలోకమున కేఁగెను. చిత్రాంగదుఁడు మహాగర్వియై గంధర్వులతోఁ బోరి హతుఁడయ్యెను. భీష్ముఁడు వారి మరణమునకుఁ జింతించి సత్యవతి నోదార్చెను.

## ధృతరాష్ట్ర పాండురాజుల చరిత్రము.

విచిత్రవీర్యునకుఁ బట్టముఁ గట్టి భీష్ముఁడుఁ గాశిరాజ దుహితలను స్వయంవరమున గొనితెచ్చి వారిలో నంబికాంబాలికలను నిరువురు గన్యకలను విచిత్రవీర్యున కిచ్చి పెండిలి చేసెను. వాఁడు పుత్త్రులు లేకుండఁ జనిపోయెను. అప్పటికిఁ గురుదేశమునకు రాజు లేఁడు. భీష్ముఁడు శంతన వంశ స్థితికి మిక్కిలి చింతించెను. సత్యవతి తనకుఁ గన్యాత్వమునఁ బుట్టిన వ్యాసుని ధ్యానించి తనకోడండ్రకుఁ బుత్త్రదానము సేయుమని ప్రార్థించెను. వ్యాసుఁడు తన మఱదండ్రగు నంబికాంబాలికలకును వారి పనుపున వచ్చిన దాసికిని ధృతరాష్ట్రునిఁ బాండుని విదురునిఁ బ్రసాదించెను. వారిలో ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁ డయ్యెను. పాండుఁడు పాండురోగి యయ్యెను. విదురుఁడు దాసీపుత్త్రుఁ డగుటచే బలాఢ్యుఁ డయ్యును రాజ్యము నేలుట కనర్హుఁ డయ్యెను. కాని వ్యాససుతుఁ డగుట వలన మహాజ్ఞానియై యుచితానుచితములనెఱింగి ధర్మవర్తనుఁ డయ్యెను భీష్ముఁడు వారలకు యుక్తవయస్సురాగానే ధృతరాష్ట్రునకు గాంధారిని, పాండురాజునకుఁ గుంతిని మాద్రినిఁ

పెండ్లిచేసెను. ధృతరాష్ట్రుఁడు రాజుగను, పాండుఁడు యువరాజుగను, విదురుఁడు మంత్రిగను, రాజ్యమును ధర్మయుక్తముగఁ బరిపాలించుచుండిరి. "కురువంశమున కభ్యుదయము మరల గలిఁగెగా" యని శాంతనవుఁడు మహానందమునఁ బాండు ధృతరాష్ట్రులకుఁ గాపై విదురునకు సకల ధర్మంబుల నుపదేశించుచు నుండెను.

## కౌరవ పాండవుల వృత్తాంతము

కుంతీదేవి కన్యాత్వమున దూర్వాసుని వర ప్రభావము చేత సూర్యునివలన కర్ణుఁడను బుత్త్రినిఁ బడసి రహస్యముగా నక్కుమారుని విడువ నతఁడొక సూతునియింటఁ బెరిగెను. సూర్యునివరము చేతఁ గుంతికిఁ గన్యాత్వభంగము రానందునఁ బాండురాజును బెండ్లియాడెను. పాండురాజు ధర్మమూర్తియై రాజచక్రంబు నెల్ల గెలిచి యనేక ధనంబులఁ దెచ్చి ధృతరాష్ట్రున కప్పగించెను. ధృతరాష్ట్రుఁడు ధర్మాచరణుఁడై రాజ్యము నేలుచుండఁగా నిద్దఱు భార్యలను వెంటఁగొని పాండురాజు వనమునకు వేఁటాడఁబోయెను. ఆయడవిలోఁ గిందముఁడను మునియును వాని భార్యయును గామరూపంబున నిఱ్ఱియు లేడియునై యుండఁగా బాండునృపతి వారిని బాణములచేఁ బడఁగొట్టెనఁ గిందముఁడు వానికి శాపమిచ్చి మృతుఁడయ్యెను. అందువలన గుంతికిని మాద్రికిని దూర్వాస వరప్రభావమున ధర్మసంతానమును బడయుటకు

ననుజ్ఞ నిచ్చెను. కుంతి యమానిలేంద్రుల యనుగ్రహమున ధర్మజ భీమార్జునులను, మాద్రి యశ్వినుల యనుగ్రహమున నకుల సహదేవులను గనిరి. ఒకనాఁడు కింద ముని శాపమున పాండురాజు మృతుఁడయ్యెను. అట గాంధారి గర్భవతి యయ్యెను పాండుసంతాన ప్రకారము విని యోర్వలేక కడుపు మీఁదఁ గ్రుద్దుకొనియెను. గర్భములోనిపిండముశతభిన్నములై క్రిందఁబడియెను. వ్యాసుఁడువచ్చి గాంధారినిఁ జీవాట్లు పెట్టి,

క. ఇమ్మాంసపేశి నేక శ
త మ్మొదయింతురు సుతులు ముదమ్మున నిది త
థ్య మ్మింకనైన నతి య
త్నమ్మున రక్షింపుము దీని నావచనమునన్.

అని యాపిండము నేకోత్తర శతఖండంబులఁ జేసి వేఱు వేఱు నేతికుండలలోఁ బెట్టి చల్లనినీళ్ళు చల్లుచుండుమని యాజ్ఞాపించిపోయెను. ఆకుండంబులయందు దుర్యోధన దుశ్శాసనాది సుతశతంబును దుస్సల యను కూఁతురు నుదయించిరి. తరువాత భీష్మధృతరాష్ట్రులు పాండురాజు మరణంబును విని చింతాక్రాంతులై యడవినుండి పాండవులను గుంతిని హస్తినాపురంబునకు రప్పించి ధృతరాష్ట్రుఁడు తన సుతులను దమ్ముని సుతులను సమాన ప్రేమతోఁ బెంచి ద్రోణాచార్యుని వలన వారలకు ధనుర్వేదంబును బాల కళా కలాపమును నేర్పించెను. ధార్తరాష్ట్రులకంటె పాండవులు తత్తద్విద్యా నిపుణులైరి.

పాండవుల యెడఁ గౌరవులకు ద్వేషము పుట్టెను. భీముని(జంపు టకు దుర్యోధనుఁ డనేకోపాయములను బన్నెను. భీమునకు విషాన్నము పెట్టించెను. నిదురవోవునప్పుడు గాలు సేతులు గట్టి సముద్రమునఁ ద్రోయించెను. విషసర్పముల చేతఁ గఱపించెను. ఇందువలన వాని కేయుపకారమును గలుగలేదు.

## వి ద్యా ప రీ క్ష .

అస్త్ర శస్త్ర విద్యలయందుఁ బ్రవీణులయిన కౌరవ పాండవులవిద్యను బరిశీలించుటకు ద్రోణుండుధృతరాష్ట్రునితో జెప్పి వ్యాస, గాంగేయ, విదుర, కృపశల్యులను సభఁగూర్చి యొకరంగము నేర్పరచెను. స్త్రీజనంబులును బ్రాహ్మణోత్తములు గూడ నాసభ నలంకరించిరి. ద్రోణుండు తన శిష్యుల నందఱను జ్యేష్ఠానుపూర్వకంబుగానిలిపి తొలుత భీమదుర్యోధనులను గదాయుద్ధమునకు విడిచెను. వారిరువురును గజము గజమును దాకినట్లు తలపడి ఘోరముగాఁ బోరిరి. దుర్యోధనుండు భీమునకు లొచ్చువడియెను. మనసులోనున్న క్రోధమున భీముఁడు దుర్యోధనునిఁ గూల్చునేమో యను సంశయమున గురుండు తన కొడుకగు నశ్వత్థామను బంపి వారిని వారింపఁ జేసెను. తరువాత నర్జునుఁడు రంగస్థలమున కవతరించెను. చూచువారందఱును వాని భీకరాకారమును జూచి పొగడిరి. కుంతియు మిగుల సంతోషించెను. సభలోనివారలు హర్షనాదములు సేసిరి. ఆధ్వని విని గ్రుడ్డియగు ధృతరాష్ట్రుఁడు "సందడికి కారణమే" మని విదురునడిగెను. విదురుఁడు

క. "భూరిభుజుం డర్జునుఁ డతి
శూరుఁడు దన యస్త్రవిద్యఁ జూపఁగ రంగ
ప్రారంభుఁ డయిన నతని న
వారితముగఁ బొగడు జనరవం బిది యధిపా!"

అని చెప్పెను. అర్జునుఁడు తన బాణకళా కౌశలమును జూపెను. "ఇదివఱ కింతటి ఘనుండు పుట్టలే" దని జనులు పొగడిరి. అయ్యది దుర్యోధనుని మనంబునకుఁ గంటకముగా నుండెను. ఇట్లు పాండవులు గౌరవులు దమ తమ విద్యాకుశలత్వమును జూపిరి. పాండవులు గురువునకు నమస్కరించిరి. దుర్యోధనుని ప్రేరేపణమునఁ గర్ణుఁడు రంగస్థలమునకు వచ్చి "యర్జునునకు మించిన యస్త్రవిద్య నే నెఱుంగుదు"నని గర్వాలాపములనాడి యింద్రనందను నాక్షేపించినిలిచెను. తఱువాత ద్రోణు ననుమతంబున గర్ణుఁడు మున్నర్జునుఁడు సేసిన పనుల న్నియు నవలీల నొనర్చెను. పిమ్మటఁ గర్ణార్జునులు వీరాలాపముల నాడుకొని ద్రోణు ననుమతినిఁ బడసి ద్వంద యుద్ధము సేసిరి. ఒకరి కొకరు తీసిపోక సమానముగా నఖిలాస్త్రములం బ్రయోగించు చున్న సమయంబునఁ గృపుండు వారిమధ్య కేఁగి "యర్జునుఁడు రాజు. నీ వెవ్వఁడవో తెలియదు. నీకులనామంబుల దెలిపినఁ గాని పోరజన" దని వారించెను. కర్ణుఁడు తన కులనామంబులఁ జెప్పి సిగ్గుపడెను. దుర్యోధనుఁడు రోషమంది కర్ణునిఁ బ్రియంబునఁ నంగరాజ్యమున కధిపతినిఁ జేసెను.

ఇంతలోఁ బ్రొద్దుగ్రుంకుటం జేసి యందఱును నిజనివాసంబుల కరిగిరి.

### ద్రోణుండు గురుదక్షిణఁ గొనుట.

మఱునాఁ డుదయమున ద్రోణుండు శిష్యులను రావించి "గురుదక్షిణ నొసంగుఁ"డని తెలిపెను. అందఱును 'మీకెద్ది యిష్టమో తెలుపుఁ డద్ది సమకూర్చెద' మని నుడివిరి. "ధనమదోన్మత్తుఁడగు ద్రుపదు నొడిచిపట్టి తెండు. ఇదియే నాకు గురుదక్షిణ. అతఁడు నాకు మిత్త్రుండయ్యు నాకవమతి సేసె" నని పలికెను.

క. వల్లెయని రాజనందను
లెల్లను సమకట్టి రథము లెక్కి దిశల్ భే
దిల్లఁగ గర్జిల్లి నిశా
తోల్లసిత కృపాణ కార్ముకోద్యతకరులై.

ధార్తరాష్ట్రులు పాండవులను బిలువకయే రయంబునఁ బాంచాలపురమ్మున కేఁగిరి. పాండవులు గురునకు నమస్కరించి వెనుకనుండి యర్జునునిగూడ ద్రుపదుని పయికిఁ బంపిరి. ముందుగాఁ బోయియున్న ధార్తరాష్ట్రులు పాంచాలపతిని యుద్ధమ్మునకుఁ జీరి యతనితోఁ బోరి పరాజితులై దీనముఖములతో మగిడి వచ్చిరి. తరువాత నర్జునుఁ డేఁగి ద్రుపదుని యుద్ధమ్మున నొంచి యతనినిఁ దనయరదమ్మునకు బంధించి తెచ్చి గురుదక్షిణగా గురున కొప్పగించెను. క్షణకోపియగు

ద్రోణుఁడు తన శిష్యునిచేఁ బరాజితుఁడైన ద్రుపదుని నెవ్వఁ బలికి క్షమించి విడిచి పుచ్చెను.

## ద్రుపదుఁడు తపంబు సేయుట.

కుంభసంభవునిచేఁ బరిభవింప బడిన పాంచాలపతి యింటికిఁ బోయి యీశ్వరునిఁ గూర్చి దీక్షతోఁ దపం బాచరించి భగవంతుని కరుణ వడసి పిదప నుపయాజుఁడను ముని పనుపున బుత్త్రికామేష్టి సేయనెంచి తనను జయించిన యర్జునునకిచ్చి వివాహముసేయుట కొఱక కూఁతును దనను బరిభవించిన ద్రోణునిఁ బరిమార్చుట కొఱక కొడుకును గాంచు నటుల నమ్మునివలన వరమ్ములంది యజ్ఞకుండము నమర్చి యజ్ఞ మాచరించెను. ఆయజ్ఞకుండమున నొక్క సౌందర్యవతియగు కూఁతురును బలవంతుఁడగు కొడుకును బుట్టిరి. ఆకూఁతునకుఁ గృష్ణయనియుఁ గొడుకునకు ధృష్టద్యుమ్నుఁడనియు నామకరణంబులగావించి యల్లారుముద్దుగాఁ బెంచి విద్యాబుద్ధుల నేర్పించెను.

## యౌవరాజ్య పట్టాభిషేకము.

ద్రోణాచార్యుఁడు తన యభిమత కార్యమును దీర్చిన యర్జునునియందు దయాపూర్ణుఁడై శాత్రవుల నమోఘముగా జయింపఁదగిన "బ్రహ్మశిరోనామక" మను మహాస్త్రమును ప్రయోగోపసంహారములతో నుపదేశించెను. ధృతరాష్ట్రుఁడు కుమారుల విద్యాప్రవీణతకు మెచ్చి ధర్మరాజునకు యౌవ

రాజ్య పట్టముగట్టెను. యువరాజైన ధర్మరాజుఁడును, దమ్ములు నుబోయి రాజులనందఱను జయించి యనేక ధనములను దెచ్చి పెదతండ్రికొప్పగించిరి. దుర్యోధనునకుఁ బాండవులయెడనున్న ద్వేషము ధర్మరాజుఁడు యువరాజై నప్పటినుండియు హెచ్చి తనకు బ్రియమిత్రులగు కర్ణ, శకుని, దుశ్శాసనులతో నాలోచించి ధర్మరాజును బురంబు వెడలనంప వలయునని నిశ్చయించుకొనియెను. తరువాత దుర్యోధనుఁడు ధృతరాష్ట్రుని కడ కేఁగి యిట్లు చెప్పకొనియెను. "తండ్రీ! పాండవులు తండ్రి లేని బిడ్డలనియు, ధర్మరాజుఁడు పెద్దయనియును వానికి యౌవ రాజ్యము నిచ్చితివి. వారలు బలవంతులగుటవలన మాయెడ నించుక ద్వేషము గలిగి యున్నారు. ముందాతఁడు రాజ యినపుడు మమ్ములను వంచింపఁగలఁడు. వానికి లోబడి జీవించ వలసిన గతి మాకుఁ గలుగుటకుఁ జింతించుచున్నాఁ డను. కావున పాండవులను గుంతిని వారణావతంబున నుండు నట్లు నియోగింపుము. హస్తిపురంబున మేముండెద" మని ధృతరాష్ట్రునితోఁ జెప్పెను. ధృతరాష్ట్రుఁడెంత వారించినను వినక కొడుకు మూర్ఖముగాఁ బట్టు పట్టినందునఁ గొడుకు నందలి ప్రేమచేత నతఁడు పాండవులకు "వారణావతం బునఁ గొంతకాల ముండి మరల రం" డని యాజ్ఞాపించెను. పాండవులు పయనమై పోవుచుండఁగా భీష్మ ద్రోణాదులు మిక్కిలి చింతించిరి. విదురుఁడును కొంత దూరము వోయి

పాండవులతో దుర్యోధనాదుల దుర్నయమును దెలిపి "జాగ్ర త్తగానుండుఁ" డని నుడివెను.

## లాక్షాగృహ దహనము.

దుర్యోధనుఁడు పురోచనుండను తన హితుని ముందు గానే వారణావతంబునకు బంపి యాయుధాగార సమీపమున లక్కయు మట్టియు జనుమును గలిపిన పదార్థములతో నొకటి చతుశ్శాలాభవనము నిర్మింపఁజేసి యుంచెను. "పాండవులా లక్కయింటఁ బ్రవేశించిన పిమ్మట వీలు చూచుకొని వారు లోన నిదురించు సమయమున నిప్పుముట్టించి పాండవులను దుద ముట్టించిన పిమ్మట హస్తిపురమ్మునకు రమ్మని పురో చనునకు సుయోధనుఁ డాజ్ఞనిచ్చి యున్నందున నతఁడచ్చటనే యుండెను. పాండవులు వారణావతము సేరి తమకై నిర్మింపఁ బడిన చతుశ్శాలాభవన మగ్నిభయకారణముగ నుండుటచేత నది దుర్యోధనుని యత్నముగానెంచి తెలిసియుఁ దెలియనివారి వలె నందుఁ బ్రవేసించిరి. వెంటనే విదురుఁడు నమ్మకమగు నొక ఖనకునికి రహస్యముగా విషయమును జెప్పి వారణావ తమునకుఁ బంపెను. వాఁడేగి 'అయ్యా! యీ బహుళ చతు ర్దశినాఁడు తమరు నిదురించుచుండఁగా నీగృహమును దగులఁ బెట్టు' మని దుర్యోధనుఁడు పురోచనునకుఁ గబురంపెను. ఆవార్త విదురుఁ డెఱింగి 'పరులెరుంగకుండ గృహములోపల

నుండి యొక బిలమును ద్రవ్వి పాండవులు సుఖముగాఁ దప్పించు కొనుట కవకాశము గలిగింపు' మని నన్నుఁ బంపియున్నాఁడు. నేనాపని నొనర్చెద" నని యొక బిలమును సమీపారణ్యము వరకుఁ ద్రవ్వెను. భీముఁడు పగటివేళ నాబిలములో దిగి పరిశీలించి చూచుకొనెను. చతుర్దశినాఁడు కుంతీదేవి బ్రాహ్మణ సంతర్పణము గావించెను. ఆరాత్రి యొక దాసియు నేవురు కొడుకులుఁగూడ నాభవనంబునఁ బరుండి యుండిరి. పురోచనుఁడు తగుసన్నాహముతోవచ్చి యాభవనంబుననే పరుండెను. భీమసేనుఁ డారాత్రి పురోచనుఁడు నిద్రపోఁగానే లక్కయింటికి నిప్పు ముట్టించి బిలమార్గమున సోదరులను దల్లినిఁ దీసికొనిపోయెను. పురోచనుఁడు నతని సహచరులును, దాసియు దానియేవురుకొడుకులును దహింపఁబడిరి. మఱునాటియుదయమున వారణావతపురజనులు విచారపడి, తగులఁబడిన యింటి బూడిదను గదిపిచూచి దాసిని దాని పుత్రులను, గుంతియుఁ బాండవులుగా నూహించిరి. ఖనకుఁడుగూడ వారితో బాటు వెదకుటనభినయించుచు బిలంబును మసితోఁబూడ్చెను. హస్తిపురమునకీవార్త ప్రాకెను. ధృతరాష్ట్రుఁడును స్త్రీలును దుఃఖించిరి. దుర్యోధనాదులు సంతోషించిరి. ఖనకుని వలనఁ బాండవుల సేమపువార్తను విదురుఁడు తెలిసికొని మనంబునందయుంచుకొనియెను. ధృతరాష్ట్రుఁడు పాండవులకును గుంతికినిఁ బరలోక క్రియలు నాచరించెను.

## పాండవు లేకచక్రపురమున బ్రవేశించుట.

ఆబిలద్వారమునుండి వెలువడి పాండవులును గుంతియు నారాత్రి యమునానదిని దాటిరి. నిద్రచేతను దాహముచేతను బాధపడుచున్న ధర్మార్జున నకులసహదేవులును గుంతియు గర ముడస్సి నడువజాలకుండుటచే భీమసేనుఁడు వారందఱ భుజంబులమీదను శిరంబునను నెక్కించుకొని యొక మహారణ్యంబు నఁబ్రవేశించి సమీపముననున్న యొక్క కొలనులోఁ దాను దాహముదీర్చికొని తామరాకుల దొన్నెలతో నుదకంబుఁ దెచ్చి నిద్రించుచున్న సోదరులకు నిద్రాభంగము సేయనొల్లక యచ్చటనుంచి వారలను గాపాడుచుండెను. ఇంతలో "హిడింబుం" డను రక్కసుఁడు వారలనుజూచి "వారినిఁదెచ్చి తనకాహారముగా వండుమని తన సోదరియగు హిడింబనుబంపెను. హిడింబవచ్చి భీమునిఁజూచి ప్రేమించి యతనిని వేఁడుచు నచటనేయుండెను. ఇంతలో హిడింబుఁడు మిగుల గోపించి పాండవులయొద్దకుఁ బోయి చెలియలిని దిట్టుచు "వారల నందఱను మ్రింగుదు" నని కేకలిడెను. సోదరులకు నిద్రాభంగము గాకుండ భీముఁడు దానవుని కుత్తుకనొక్కి దూరముగాఁగొనిపోయి వధించెను. తఱువాత ధర్మజాదులు మేల్కాంచిరి. హిడింబ వారి నిద్రాకాలమున సరిగిన వృత్తాంతము ధర్మనందనునకుఁజెప్పి తనకు భీమునియందుఁగల పతిభావమును జెప్పెను. అతండు భీము నొడంబరచి హిడింబను భార్యగా జేసిన

నామెకు ఘటోత్కచుఁ డుదయించెను. వాఁడు కామరూపుఁడై తండ్రులకు నమస్కరించి "వలసినప్పుడు తలఁచిన వచ్చెద" నని చెప్పి తల్లిని గొనిపోయెను. పాండవులు కొంత దూరము పయనమై పోవుచుండ వ్యాసుండు ప్రత్యక్షమై ధృతరాష్ట్రుని దురాగతంబునకుఁ జింతించి "బ్రాహ్మణ వేషంబులతో నేకచక్రపురంబునఁ గొంతకాలముండుఁడు. నేను మరలఁ గన్పడి భావికార్యంబుఁ జెప్పెద" నని పచించి తిరోహితుండయ్యెను. పాండవులును విప్రవేషములతో నేకచక్రపురమునకుఁ బోయి యొక బ్రాహ్మణ గృహంబున విడిది చేసికొని యుండిరి.

## బకాసుర వధ.

బకాసురుఁ డను దానవుఁడు తన దౌష్ట్యము చేత నేకచక్రపురవాసులను బీడించుచుండగా నా పౌరులు వానితో సఖ్యము చేసికొని ప్రతిదినము నింటికొక బండెడు మాంసమిశ్రితమగు నన్నమును రెండెనుబోతులును నొక్క మానిసియు వరుసను దినమునకొక యింటివా రిచ్చునట్లేర్పఱచికొనిరి. ఒకనాఁడు పాండవులు గాపురమున్న యింటివారివంతు వచ్చెను. ఆ యింటి కుటుంబమువారలు బకుని కాహారమగుటకు 'నేఁబోయెద నేఁబోయెద' నని యొకరి నంపుట కొకరు చింతించుచుండగా కుంతీదేవి విని యాగృహమేధి కిట్లులనియెను. "అయ్యా! నీ వేక పుత్రుఁడవు. నా కేవురు

పుత్త్రిలుగలరు. వారిలో నొకని బ్రాహ్మణార్థంబు దనుజున కశనంబుగా నిచ్చెదను. జింతింపకు" మని చెప్పెను. విప్రుడు చెవులుమూసికొని "శివశివా! నా కొఱకతిథి ప్రాణములఁ గొనుటకు సమ్మతింప" ననియెను. కుంతి 'బ్రాహ్మణో త్తమా! నాకొడుకు దనుజునిచేఁ జచ్చువాఁడు గాఁడు. బల పరాక్రమములు గలవాఁడును మంత్రవేత్తయునై యున్నాఁడు. అందుచే నేనియ్యకొంటి' నని చెప్పెను. ఈమాటల పౌరులందఱు విస్మితులైరి. ఆహార లోపముచేఁ గృశించి యున్న భీముని బ్రాహ్మణులందఱును మృష్టాన్న సంతృప్తిని గావించిరి. భీము డతి సంతోషముతో బండిని దోలుకొని పోయి శుచిప్రదేశమున నిలిపి బకునిఁ గేక వేసి వాఁడు వచ్చు లోపలనాబండిలోనియన్నమంతయుఁదినెను. బకుఁడుగోపించి భీమునిపైఁ గవిసెను. భీముఁడు వానిని సులభముగాఁ దుద ముట్టించి యాతని మహాకళేబరమును నీడ్చి తెచ్చి పుర సమీప మునఁ బడవేసి పౌరుల కానందాశ్చర్యములఁ గలిగించెను.

## ద్రుపదుని వృత్తాంతము.

కొన్ని దినంబులు పాండవు లాపురంబున నుండిరి. దక్షిణ దేశమునుండి యొకబ్రాహ్మణుండు వచ్చి 'ద్రుపద పుత్త్రికయగు ద్రౌపది నర్జునునకిచ్చుటకై ద్రుపదుఁడు మజ్ఞ కుండంబునఁ బడసెను. పాండవులు లాక్షాగృహాగ్ని నిమగ్ను లైరని విని చింతించుచున్న ద్రుపదునకుఁ బురోహితులు

జ్యోతిషమూరసి "పాండవులు సుఖంబుండి"రని చెప్పిరి. అందుచేతఁ బాండవు లెచ్చట నున్నను రాఁగలరను తలంపుతో ద్రుపదుఁడు కూఁతునకు క్షత్రియకుల యోగ్యంబగున స్వయంవరంబును చాటఁబంచెను.

క. యెవ్వరికిని మోపెట్టను
దివ్వను శక్యంబుగాని దృఢ కార్ముకముఁ
దవ్వైదినమునఁ దిరిగెడు
నవ్విలసత్కనక మత్స్యయంత్రము జేసెఁ.

అని నుడివెను. పాండవులును గుంతియు నావార్తను విని పాంచాలదేశమునకుఁ బయనంబై పోవుచుండిరి. మార్గమధ్యమున వ్యాసుఁడు గన్పడి "కుమారులారా! మున్నొక మునికన్య పత్యర్థము తపంబుసేసి శంకరుఁడు ప్రత్యక్షమగుడు 'బతిదాన' మని యేనుమాఱులు వేఁడెను. అయ్యబలకు 'జన్మాంతరమున నేవురు పతులగుదు' రని వరంబిచ్చెను. ఆమెయే యీ ద్రౌపది. మీకు శుభంబగుఁ బొం" డని ధర్మజునితో జెప్పి యంతర్హితుండయ్యెను. పాండవులచ్చోటువాసిరి. అర్జునుఁ డంగారపర్ణుని జయించి యాతని వలనఁ జాక్షుషీవిద్యఁ గఱచెను. ధౌమ్యుఁ బురోహితునుఁగాఁగొని స్వయంవరసమయమునకుఁ బాంచాలదేశము సేరి పాండవులొక కుంభకార గృహంబున విడిసి భోజనాదికముల దీర్చికొని విప్రవటు వేషములతో సభాస్థలంబున కరిగిరి.

## ద్రౌపదీ స్వయంవరము.

నానాదేశరాజులును వచ్చి యెడము లేకుండ సభాస్థలమునఁ గూర్చుండిరి. ద్రౌపదీ సోదరుఁడగు ధృష్టద్యుమ్నుఁడు లేచి "ఈవిల్లు మోపెట్టి యేను బాణములచేత నంతరిక్షమున దిరుగుచున్న మత్స్యయంత్రమును దెగవేసిన మహావీరుఁడు నాసోదరికి బతికాఁగలఁడు. సమర్థులగువారీపనికిఁ గడఁగుఁ"డని చెప్పెను. పెక్కుమంది యెత్తించి విల్లు మోపెట్టఁ జాలక పోయిరి. కర్ణుఁడు విల్లువంచి రోమమాత్ర మెడముగా నారిని దివిచియుఁ దగిలింపఁజాలక విముఖుఁడయ్యెను. విప్రవటు వేషమున నర్జునుఁడు లేచి వింటికడ కేఁగి గురుని ధ్యానించి వింటికిఁ బ్రదక్షిణ నమస్కారములు జేసి విల్లెత్తి చిరపరిచితమైన వింటి యట్లు మోపెట్టి యంత్రముఁ దెగవేసెను. ద్రౌపది వాని కంఠమునఁ బువ్వుమాలనుంచి నమస్కరించి యతనిపజ్జనిలుచుండెను. అందరు నాశ్చర్యపడిరి. రాజులందరును,

చ. " ఫలపవనాంబుభోజనశుభవ్రతవృత్తుల జేసి, చూడ దు
ర్బలతనులయ్యు బ్రాహ్మణులపారతపోబలసంపదన్ మహా
బలయుతు లట్టివారలకు భవ్యుల కెందు నసాధ్యమెద్దియుం
గలదె? చరాచరాఖిలజగంబులఁ బెద్దలు కారె? సద్ద్విజుల్"

అనిపొగడిరి. దుష్టుఁడగు సుయోధనుఁ "డీబడుక్షత్రియులరావించి కన్యను బాపని కేల యీవలయు" నని ద్రుపదుని పైగోపించి తన హితుల గలిపికొని యుద్ధమునకుఁ గడం

గెను. ద్రుపదుఁడు బ్రాహ్మణుల మఱుగున కేఁగెను. బ్రాహ్మణులు దమతమ దండాజినంబుల నెత్తి రాజులం దలపఱిరి. వారలఁజూచి సవ్యసాచి నవ్వి యిట్లనియె.

క. కడఁగి మదీయాస్త్రము లని
యెడపటుమంత్రముల నివ్వడినృపఁపులఁ
గడిఁది విషాహుల దర్పం
బుడిగించెదఁ దొలగిచూచు చుండుడు విప్రుల్.

అని అర్జునుఁడును, భీముండును రిపులఁదాఁకివిజృంభించి తఱిమి వేసిరి. పిదప నర్జునుండు కృష్ణంగొని తల్లికడ కేఁగి ఫలంబుఁ దెచ్చితిననియెను. ఆమె 'యేవురు ననుభవింపు' డని చెప్పి యర్జును పిఱుంద నున్న సతిఁ జూచి 'పొరఁబడితి' నని చింతించెను. పాండవు లేవ్వురకు నేక కాలంబునఁ గృష్ణయందు బ్రేమ గలిగెను. మాతయాజ్ఞ నేవురు వివాహమగుటకు నిశ్చయించిరి. ద్రుపదుండు పురోహితునిఁ బంపి యల్లుండ్రను గుంతిని రావించెను. వ్యాసుండును వచ్చెను. ద్రుపదునితో "ద్రౌపది కేవురును పతులు. ఇది విధివిహితంబు. దినదోషంబు లేదు. వీరు పాండవులు. ముదంబునం బెండ్లి సేయు" మని వ్యాసుఁడు వచించెను. వేదవిభాగి యగు నమ్మౌని పలుకులు వేదంబులుగా దలఁచి యట్లొనర్చిరి. పాండవులల్లుండ్రయినందు నకు ద్రుపదుఁడును, నర్జునాదులు భర్తలగుటకు గృష్ణయు, గడు మోదమందిరి. పాండవులు హస్తిపురంబునకుఁ బోయి

యట నుండి విశ్వకర్మనిర్మితంబగు నిందప్రస్థపురమున బ్రవే
శించిరి.

## పాండవుల వ్రతము.

నారదుండు పాండవులకు సుందోపసుందోపాఖ్యానముఁ
జెప్పి "యీ కాంతకొఱకు మీలో మీరు పోరాడక యొక
యేడాక్కరుగా ననుభవింపుచు నాకాలమున మఱియొకరా
యంతః పురమునకుఁ బోరపాటున నేనిఁ బోయినఁ బండ్రెండు
మాసంబులు చాంద్రాయణ మొనర్చునటుల సమయంబు సేసి
కొనుఁడు.

క. ఇంతుల నిమిత్తమున ధృతి
మంతులుఁ బొందుదురు భేదమతి గావున మీ
రింతయు నెఱింగి యొందులు
చింతింపక సమయ మిపుడు సేయుఁడు బుద్ధిన్.

అనినఁ బాండవు లట్లు శపథంబులు గావించి సుఖం
బుండిరి.

## అర్జున తీర్థయాత్ర.

ఒక నాఁడు మ్రుచ్చులచే హోమధేనువుగోల్పడిన యొక
విప్రుండు బిగ్గనేడ్చుచు నర్జుని రక్షణగోరెను. ఫల్గునుఁడా
విప్రునకభయంబిచ్చెను. అతఁడు ఆయుధాగారమున ధర్మ
జుఁడు ద్రౌపదితో నుండుట యెఱింగియు విప్రరక్షణార్థమందుఁ
బ్రవేశించి తన కార్ముకముం గొనియెను.

క. ధరణీసురవరులకుఁ గడు
నెరగై నెడ నెఱిఁది యెడయు జేయుదు రె? మహా
పురుషులని నరుఁడు విలుఁగొని
యరిగెను ముచ్చుల పిఱుంద నవ్విప్రుపనిఁ.

పోయి ముచ్చులవధించి విప్రునిఁ దృప్తుఁజేసి క్రమ్మఱి వచ్చి ధర్మజునకు మ్రొక్కి "ద్వాదశమాసిక వ్రతంబానర్పఁ బోయెద" నని వేఁడెను. అతఁడు,

ఆ—వె. "క్రూరకర్ములయ్యు గోబ్రాహ్మణుల కగు
బాధలుడుచు జనులఁ బాపచయము
లెట్టియెడలఁ బొంద వింద్రనందన నీకు
సమయభంగభీతిఁ జనఁగ నేల"

అని వారించెను. అర్జునుఁడు వినయముతో "నగ్రజా! లోకములకు నీతిఁనేర్పదగిన మనము వ్రతలోప మాచరించుట తగ" దని మిగులఁ జెప్పి ధర్మజు ననుమతంబున నతఁడు తీర్థయాత్ర కేఁగి శ్రీశైల, భీమేశ్వర, రామేశ్వరాది మహాపుణ్యక్షేత్రముల సేవించి యనేక పుణ్యనదీస్నాతుఁడై మణిపూరపురంబున కేఁగి యటఁ జిత్రాంగదను బెండ్లియై యామెయందు బభ్రువాహనుఁడను గొడుకుఁబడసిదక్షిణసముద్రతీరంబుననున్న సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న, భారద్వాజంబులను పంచతీర్థములు సేవింపఁ బోయెను. అచ్చట నిమ్నోన్నత మగు నొకట సరోవరంబునఁ దాన మాడుటకుఁ

ప్రవర్తించుచుండఁగా నచ్చటి జనులు "అయ్యా! అందు మొసళ్లున్నవి. దిగఁబోకుము. మహాక్షేత్రంబు లయ్యును నూఱు సంవత్సరములనుండియు నిందు మొసళ్లు వసించుట వలన తైర్థికు లాతెన్నున కేఁగకుండి" రని మొఱ్ఱలిడిరి. వారి మాటలను సరకుఁ గొనక యతండందున దిగి గ్రుంకులిడెను. అప్పుడొక యుగ్రగ్రాహ మతని కరమును బట్టుకొనియెను. అర్జునుఁడు సేయి విదళింప నా మొసలి సరసుఁ నొడ్డునఁ బడి యొక దివ్యవనితా విగ్రహమయ్యెను.

## అప్సరోగణ శాపము.

అర్జునుఁ డాశ్చర్యము నొంది యాదివిజకాంతను "నీ పూర్వవృత్తాంతమే" మని యడిగెను. ఆచెలువ అతనితో నిట్టులనియె. "మహానుభావా! నేను 'వంద' యను నప్స రసను, నాసఖులగు సౌరభేయియు, సమీచియు, బుద్బుదయు. లతయు, నను మఱి నల్వురు నా యట్ల యాతీర్థంబులం దున్న వారలు. మేము లోకంబులన్నియువినోదమునకై సంచరించుచు భూలోకమునకు వచ్చి యుగ్రతపంబు సేయుచున్న యొక బ్రాహ్మణుఁ జూచి వాని తపస్సునకు భంగము సేయుటకు మే మాటలఁ బాటలనెన్నియో విధములఁ బ్రయత్నించితిమి. అతఁడు మావంకఁ గన్నెత్తి నైన జూడఁడయ్యె. మేమురాగ కారణ వికారంబులు గావించిన నవి యమ్మునికిఁ గోపకారణ ములై మహాగ్రాహంబులుంగండని మమ్ము శపించిన మేము

నమస్కరించి శాపమోక్షమును వేఁడుకొంటిమి. అతఁడు గరుణించి, మీచే, బట్టువడి మీరున్న మడువునుండి మిమ్ముల నెవఁడు వెలువరించునో యతఁడు శాపమోక్ష కారణుఁడగు నని చెప్పెను. నేఁటికిఁ నీకతంబున మాపున్నెముపండిన" దని నమస్కరించెను. అర్జునుఁడు మిగిలిన నలువురను గూడ వెడలించెను. అప్సరాంగన లేవురు నమరావతికిఁ జనిరి. అది మొద లవి నారీతీర్థంబులనఁ బ్రసిద్ధములయ్యెను. అర్జునుఁ డటనుండి ద్వారకకువచ్చి యతివేషంబున సుభద్రనువివాహంబై కృష్ణానుమతంబున యాదవ వీరుల నుక్కడఁగించి సుభద్రతోఁ నింద్రప్రస్థ నగరంబునఁ కరుదెంచెను.

## ఖాండవ దహనము.

తఱువాత శ్రీకృష్ణుండు తన సోదరి యగు సుభద్రకమూల్యాభరణంబుల నరణంబుగాఁ గొని యింద్రప్రస్థంబునకు వచ్చి పాండవులచేఁ బూజితుండై యున్న యెడ నొకనా డర్జునుఁడు గృష్ణునిఁజూచి యిట్లనియె "బావా! ఈ వేసఁగి కాలమ్మున నొక్క వినోదవనమ్మున కేఁగిసమయముబుచ్చుద" మని చెప్పెను. అయ్యిరువురును బయనమైపోయిరి. ఇందుఁ నత్యంతప్రియంబునఁగా పాడుచున్న ఖాండవవనంబు సేరియచ్చట నొక రమ్య శిలావేదికపైఁ గూర్చుండిరి. వారలయొద్దకొక ముసలిపాఱుఁడు వచ్చెను. అయ్యిరువురును వానికతిగౌరవంబున బూజలు సల్పిరి. విప్రుడు 'ధన్యులారా! నేనతిభోజనుఁడను.

నాకుఁ బ్రియమగు నాహారము నీయఁగలిగితి వేని నన్ను సత్క-
రింపుఁ' డని వేఁడెను. కృష్ణార్జును లొడంబడి కోరుమనిరి.
అప్పాఱుఁడు వాగ్దానమును గొని వారలతో నిట్లనియె.
'శూరులారా! నేనగ్నిహోత్రుఁడను. తొల్లి శ్వేతకి యను
రాజర్షి, నూఱువత్సరములు సత్రయాగము సేయఁదలఁచి యనేక
విప్రమునివరులను 'ఋత్విజులుగా' నుండఁ బ్రార్థించెను.
దీర్ఘకాల మీకార్యమున నుండవలయునని విసివి యెవ్వరు
నొప్పుకొనరైరి. శ్వేతకి యీశ్వరునిఁ గూర్చి తప మాచరించి
నఁ బ్రత్యక్షమై యతఁడు దుర్వాసుని ఋత్విజునిఁగా నప్పగిం
చెను. ఆ రాజర్షి యమితఘృత హోమంబున యాగంబు బూర్తి
చేసెను. ఆ నేతినిఁ గ్రోలుటచేత మందుఁడనై పాండురోగపీడి
తుఁడనై బ్రహ్మనియోగంబున నౌషధమ్ముగా ఖాండవవనమ్ము
దహింపబూనితిని. ఇంద్రుండు మేఘంబుల నొక్కసారిగాఁ
గురిసి నా ప్రయత్నము నాటంకపఱచెను. మీరు మహాశూరు
లరు. ఇంద్రునోర్చి నా కాహార మొసగుఁ' డని ప్రార్థించెను.
'హుతాశనా! మాకడ మహనీయాస్త్ర మంత్రము లనేకము
లున్నవి. కాని విల్లునమ్ములు రథము మొదలగు యుద్ధపరికర
ములు లేవు. ఆకారణమ్మున సంశయించుచుంటి' మని చెప్పిరి.
అగ్నిదేవుఁడు పార్థునకు గాండీవంబును నక్షయబాణతూణీరం
బులును గంధర్వ హయంబులం బూన్చినరథంబును, గృష్ణునకు
గదయుఁ జక్రంబును గానుకగా నొసంగి వాని యఖండ శత్రు

జయసామర్థ్యంబును దెలిపెను. కృష్ణార్జునులు ప్రీతులై యిం ద్రాదిదివిజులవలన నాతంకములు గలుగకుండ ఘోరయుద్ధం బున నింద్రునోర్చి యగ్నిహోత్రునకు సాంతముగా ఖాండవ వన దాహభోజన మొసంగిరి. ఇంద్రుఁడు కృష్ణార్జునులపరాక్ర మమునకు మెచ్చి కృష్ణునకు నమస్కరించి యర్జునునకు నాగ్నేయవారుణవాయువ్యాద్యనేక దివ్యబాణంబులొసంగెను అర్జునుని శరణాగత రక్షణత్వమునకు వీతిహోత్రుఁడు సంత సించి చనియెను.

క. శరణాగత రక్షణ త

త్పరుఁడు ధనంజయుఁడు మయుని ప్రాణముఁ గాచెం
గరుణను శరణాగతు లగు
పురుషుల రక్షించుకంటెఁ బుణ్యముగలదే ?

ఇది యాదిపర్వము.

అవిఘ్నమస్తు.

# భారతసారము.

## సభాపర్వము.

అర్జునునిచేఁ గాపాడఁబడిన మయుండు విశ్వాసపూర్వకంబుగా నింద్రప్రస్థపురంబునఁ బాండవుల కపూర్వసుందరం బగు నొక సభామందిరమును నిర్మించెను. మఱియు భౌమాదిత్యునిచే నిహితంబయిన సకలశత్రుఘాతిని యగు నొక దివ్య గదను భీమసేనునకు దివ్యఘోషంబు గలుగు "దేవదత్తం"బను శంఖము నర్జునునకు నొసంగెను. ధర్మజుండా సభామందిరమునఁ బ్రవేశించినపుడు సకలరాజ చక్రమును గానుకలు తెచ్చిరి. నారదుండనేక రాజధర్మములను యుధిష్ఠిరునకుఁ బ్రబోధించెను. మయనిర్మిత సభామందిరము నారదుండు చూచి "యిది యపూర్వ" మని వానికిఁ జెప్పి యింద్రయమవరుణాదుల సభామందిర విశేషంబులను దెలిపెను. అతఁడు ధర్ముని సభలో నున్న పుణ్యులగు రాజర్షులను జూచితిననియు నందు నివసించి యున్న పాండు నృపతితో మాటలాడితిననియు నతఁడు 'పాండవులు రాజసూయ మొనరించినఁ దనకు సద్గతులు స్థిరములగు నని కోరె' ననియు వచించెను. ధర్మజుఁడు కృష్ణుని రావించి తండ్రిసందేశమును దెలిపెను. కృష్ణభీమార్జునులు 'రాజసూయము తప్పక చేయవలయు' నని ధర్మజునిఁ బ్రేరేపించిరి. ధర్మ

రాజు కృష్ణునివలనఁ బ్రఖ్యాపవంతులగు ప్రాగ్దక్షిణ బశ్చిమో త్తరదేశ రాజవర్యుల పరాక్రమములు విని యొకానొక వీరుఁడును కృష్ణునకు విరోధియునైన యనేక సారులతని వంచించిన జరా సంధుని పుట్టువు తెలియంగఁ దెలుపుమని కోరెను. హరి యా తని కిట్టులనియె.

### జరాసంధ జన్మవృత్తాంతము

"మగధదేశాధీశుఁడైన బృహద్రథుఁడను రాజుగలఁడు అతఁడు కవలవారలగు కాశీరాజదుహితలను బెండ్లియై వారల తోఁ జిరకాల మిష్టోపభోగంబుల నుండియు సంతానమును గాంచక విసివి భార్యలతోఁగూడఁ దపోవనమున కేఁగి యచ్చట దపంబాచరించుచుండెను. గౌతముఁడు పుత్రార్థియై వచ్చిన యతని మనోగతంబెఱింగి వానికిఁ బ్రియమును సేయనెంచి కన్నులుమూసికొని ధ్యానించిన నొకఫలము చెట్టుమీఁద క్రిందఁ బడియెను. ఆ ఫలంబును బృహద్రథున కొసంగి "దీని భక్షిం చిన కాంతకు ద్విజమునకు కోమసుమగును" నని చెప్పి పంపెను. బృహద్రథుఁడా ఫలమును గొని పురంబునకు వచ్చి నడిమికిఁగోసి సమానప్రియములగు నిరువురు భార్యలకు నొసం గెను. ఆకాంత లాఫలభాగములను భక్షించి గర్భంబులందాల్చి పదియవమాసంబునఁ జెఱియొక శిశ్వర్ధభాగమును బ్రసవిం చిరి. ఆస్త్రీలు సిగ్గుపడి బాలశకలములను గోటవాఁకిటఁ బాఱ

వైచిరి. 'జర'యను రక్కసి మాంసార్థినియైవచ్చి యాశకలము లనుగలిపి చంకనిడుకొనగానే శిశువై యాతఁడామెకు మోయుటకు శక్యముగాని భారమునగాపించెను. ఈ విపరీతమున కాశ్చర్యమొంది ఒర శిశువుఁగొని తెచ్చి వృత్తాంతముఁదెలిపి బృహద్రథునకిచ్చెను. ఆబాలునకు జరాసంధుఁడను నామం బిడెను. గౌతముఁడువచ్చి యా బలవచ్ఛిశువుం గాంచి యేయస్త్రంబును వానిశరీరము భేదింపఁబడకుండునట్లు వరమునిచ్చెను. ఆ జరాసంధుని మల్లయుద్ధమున బాహుబలంబుసూపి నిర్జింప వలసినదేకాని బాణయుద్ధమున కతఁడు సాధ్యుఁడు గాఁడు. భీముఁడాతని నొంపగల' డని కృష్ణుఁడు చెప్పెను. అందుపై ధర్మజుఁడు ధైర్యమూని రాజసూయము చేయ నిశ్చయించి కృష్ణ భీమార్జునలను జరాసంధవధార్థము పంపిన వారేగిరి. భీముఁడు మల్లయుద్ధంబున జరాసంధుని నిర్జించి యాతనిచే బంధితులైయున్న రాజులను విడిపించెను.

## దిగ్విజయము.

చ. భరతకులైకభూషణుఁడు భాసురతేజుఁడు ధర్మనందనుం
డురుభుజవిక్రమంబున జయోన్నతిఁబొల్పగ వీరు లోకపా
లురయని భీము బార్థునకులుల్ సహదేవునిబంచెఁదూర్పును
త్తరములు బశ్చిమంబు మఱిదక్షిణముల్ వరుసన్ జయింపఁగన్

అర్జునుండుత్తరదిక్కునకేఁగి యగ్నిదత్తంబులగు దివ్య రథగాండీవంబులను మయదత్తంబగు దేవదత్తమును సహాయ

ములుగాఁగొని కతిపయసైన్యంబులు వెంట రా నెల్లరాజులను జయించి వారివలన ధనంబులం గొనుచు నుత్తర కురుభూముల కుం జని యచట రాజులతో,

తే. గీ. రాజసూయాధ్వరము ధర్మరాజు సేయ
నుత్సహించినవాఁడు తదుత్సవమున
కిందు మీయందుఁ గలవస్తు వెద్దియైన
నమ్మహీనాథు సామ్రాజ్య మతిశయిల్ల.

అనిన వారలర్జునునియెడఁ బ్రీతచిత్తులై యమూల్యము లైన యపరిమిత సువర్ణ దివ్యరత్నాభరణంబుల నిచ్చిరి. భీము సేనుండు మయదత్త గదాయుధుండై సైనికుల వెంటఁగొని తూర్పుదిక్కునకుఁబోయి విదేహదశార్ణవాశ్వమేధ దేశపతుల జయించి యపారధనంబులుగొని చేదిపతియగు శిశుపాలునిఁ జూడఁబోయి యతనిచేఁ బూజితుండయి యతఁ డతి మన్న నలతో నపారధనంబులొసంగినఁ గొని పుళింద కోసల కాశ్మీర కాశీ మత్స్య కర్ణాట మాగధ జలోద్భవ భల్లాభ కిరాత కర్ణవత్సపుండ్ర పౌండ్రక దేశముల రాజులను జయించి నూఱుకోట్ల రత్న రజిత భర్మతతులం గొనియెను. సహదేవుండు దక్షిణ దిక్కునకేఁగి సుమిత్ర, శూరసేన, దంతవక్త్ర, యవన, జంటక, విందానువింద, మందదర్ప, నీల, రుక్మి, భీష్మక, శూర్పారక, నిషాద, పురుషాద, కర్ణప్రావరణమహీశులచే ధనంబులు గొని తాళవన పాండ్య కేరళ కాళింగ ద్రవిడ యవనకరహాటక

లంకాధీశ్వరుల నందఱను జయించి రత్నమయ భూషణాద్యనే కధనంబుల సంగ్రహించెను. నకులుఁడు పశ్చిమదిక్కునకుఁ బోయి మాద్రేయునితో ఘోరంబుగాఁ బోరి దత్తకమయూర కాది శూద్రులం దాఁకి మరు మాళవ బర్బర కర్పర శైరీషక దేశాధిపతుల నొంచి యరణ్యవాసులను నదీతీరగ్రామస్థులను బర్వతనివాసులం వశగతులం జేసికొని కిరాతవీరునిఁ బరాజితుఁ జేసి వరుణేంద్రాది దిగధినాథుల జయించి వారలవలన గొనిన యపారధనములు పదికోట్ల లొట్టియలపైఁ గట్టుకొని మేనమామయగు శల్యునిఁజూచి ధనంబులఁ గొని తన రాక వాసు దేవున కెఱింగించి మన్నన లంది యింద్రప్రస్థ పురాభిముఖుండయ్యెను. ధర్మరాజు నల్వురు సోదరులు గొని తెచ్చిన ధనమునకును వారల దిగ్విజయంబునకును నపార సంతోషము నందెను.

## రాజసూయము.

మధుసూదనాను మతంబున రాజసూయంబొనర్చుటకు ధర్మజుఁడు ప్రారంభించి పురోహితుఁడగు ధౌమ్యుని పంపునఁ గ్రతు వస్తువుల సమకూర్చుటకును, సమస్త రాజులను బంధులను రావించుటకు సహదేవుని, దానవిషయంబులందు గృపాచార్యునిఁ, గృతాకృత పరిజ్ఞానంబునందు భీష్మద్రోణులను, సకలవస్తువ్యయమునందు విదురుని, నానాదేశగత రాజవర్యులిచ్చునుపాయనంబుల గైకొనుటకు దుర్యోధనుని, భక్ష్యభో

జ్యాదివిధియోగంబునందు దుశ్శాసనుని, నియోగించి ధర్మరాజు దీక్షితుఁడై మహాముని సంతతులను యజ్ఞప్రవర్తకాది దేవతలనుగా నియమించి భీష్మానుమతంబునఁ గృష్ణునకు ఋత్విజపదమున కర్ఘ్యమొసంగెను. శిశుపాలుఁ డసూయాగ్రస్తుఁడై,

మ. అవనీనాథు లనేకు లుండఁగ విశిష్టారాధ్యు లార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులుపల్వురుండఁగ ధరిత్రీనాథ గాంగేయ దు
ర్వ్యవసాయంబునఁగృష్ణుఁగష్టచరితున్ వార్ష్ణేయుఁబూజించి-
నీయవివేకం బెఱింగించి తిందఱకుదాశార్హుండు పూజార్హుఁడే?

మఱియు భీష్ముని ధర్మజునిఁ గృష్ణుని ననేకవిధమ్ములఁ దూలనాడుచు శిశుపాలుండు గృష్ణునిపైఁ గవిసిన నతఁడు చక్రంబును ప్రయోగించి చేదిపతిని సంహరించి ఋత్విజుండై ధర్మజ రాజసూయమును నిర్విఘ్నముగా గొనసాగించెను. సర్వవిధమ్ముల నందఱును సంతుష్టమానసులైరి. దుర్యోధనునకు మాత్రము ధర్మరాజాదుల యున్నతకీర్తియం దసూయ జనించెను.

### దుర్యోధనుఁడు తండ్రితో మొఱపెట్టుకొనుట

శకుని, కర్ణ, దుశ్శాసనులను బిలిచి దుర్యోధనుఁడు తన యసూయను వారలకుఁదెల్పి పాండవుల యైశ్వర్యమును హరింపఁ దగిన యుపాయమును జెప్పుఁడని కోరెను. శకుని మేనల్లునితో నిట్లులనియెను. "సుయోధనా! నీవు నీతండ్రి నొడంబఱచి తేని ద్యూతప్రియుఁడగు ధర్మజుని మా

యాద్యూతంబున నోడించి వాని విభవమంతయు నీకుఁ గట్టి పెట్టి వారలను నీదాసులనుగాఁ జేసిన" నని ప్రోత్సహించెను. ధృతరాష్ట్రునితో సుయోధనుఁడు బాష్పపూరిత లోచనుఁడై యిట్టులనియె 'తండ్రీ! పాండవుల కీరితియు విభవమును వారి పరాక్రమమును జనవశ్యతయు విజయమును జూచి నా కన్నులు కుట్టుచున్నవి. రాజసూయంబున మహోన్నతులై పాండవు లుండ నచట సామాన్యులవోలె నేనును నాసోదరులును దిరుగుటకు సిగ్గిలితిమి. అపూర్వమగు నతని మందిరమును జూచుతఱి మందిరవిశేషంబు తెలియఁగజాలక తిన్నగా నంచి యొక్క జలాశయంబున బడితిని. నావస్త్రములు దడిసెను. నాపాటుఁజూచి భీముండు నగియెను. ధర్మరాజుఁడు వగచి క్రొత్త బట్టలఁ దెప్పించి నాకిప్పించిన గట్టుకొని వచ్చుచుండగా రత్నకుడ్యమున ద్వారప్రతిబింబమును ద్వారమ్ముగాఁ గాంచి చొరఁబడఁబోవ గోడయొకమ్మునకుఁ దగిలి నెత్తురు క్రమ్మెను. దానింజూచి పరిచారికలతో నున్న ద్రౌపది నవ్వెను. ఈపరాభవంబునకు వారల యైశ్వర్యమునకు నే నోర్వజాల. సుహృద్యూతమ్మున వారి విభవము హరింపఁ దలంచితిని. అనుమతి నిమ్ము. లేదేని చత్తుఁ జుమీ" మని వేడెను. ధృతరాష్ట్రుఁ డెన్నియోవిధమ్ముల వారించియు నతఁడు వినమిఁ దుదకొడంబడి యొక నూతన మందిరము నిర్మించి పాండవులను రావించెను. విదురుఁడు రాబోవు చేటుగుల నెంత బోధించినను వినక నొగ్గక ధర్మజుని సుహృద్ద్యూతమునకుఁ బ్రేరేచిరి. ధర్మజుఁ

"డనర్థదాయకమగు ద్యూతము వల" దని చెప్పెను. శకుని ధర్మజునితో "నోడితి" ననిన మిన్నకుందుమని పౌరుషోక్తులాడెను. యుధిష్ఠిరుఁడు పౌరుషంబున సుయోధనుని పక్షమున శకునితో జూదమాడెను. అతఁడు మణిభూషలును మందిరములును బత్తనంబులును దేశములును రాజ్యమును దమ్ములను దన్నును దుదకు శకుని ప్రేరేపణమున ద్రోవదినిఁ గ్రమక్రమముగా నావేశపూరితుఁడై పందెమొడ్డి యోటువడెను. దుర్యోధనుఁడత్యుత్సాహుఁడై "కౌరవదాసియగు ద్రౌపదిని దోడి తెమ్మని విదురున కాజ్ఞాపించెను. అతఁడు వానినిఁ జీవాట్లు పెట్టి, తగదని బుద్ధిసెప్పెను. సుయోధనుండు రోషపూరితుఁడై ప్రాతిగామి నంపెను. వాఁడు పోయి "అమ్మా! నీపతి ద్యూతమ్మున భూషణరాజ్యములను దమ్ములను దన్నుఁ నిన్ను గూడ సుయోధనున కోడెను. సుయోధనుండు నిన్నుఁ గొని రమ్మని నన్నుఁబంప వచ్చితి" నని చెప్పెను. ఆయబల "ధర్మజుఁడు తన్నోడి నన్నోడెనో నన్నోడి తన్నోడెనో" కనుగొని రమ్మని వానినిఁ బంపెను. అతఁడు తిరిగి వచ్చి సుయోధనున కెఱింగించెను.

## ద్రౌపదీ వస్త్రాపహరణము.

సుయోధనుఁడు కోపించి దుశ్శాసనుని బంపెను. వాఁడేగి యంతఃపురమందున్న పాంచాలిఁ గొప్పువట్టికొని సభకీడ్చి తెచ్చెను. పరాజితులయిన పాండవులు తలలువంచుకొని మిన్న

కుండిరి. భీష్మాదులు ‘ భావికార్యబీజ’ మగు నికార్యమును వారింపక మిన్నకుండిరి. వికర్ణుఁడు చిన్నవాఁ డయ్యును, “ ద్రౌపది యధర్మవిజిత” యని ధర్మసంస్థాపనము సేసెను. కర్ణుం డతని వారించెను. దుశ్శాసనునకుఁ “ బాండవులయు ద్రౌపదియు , వస్త్రముల గొను”మని సుయోధనుం డాజ్ఞాపిలచెను. పాండవులు స్వయముగాఁ బయి వల్వల నొసంగిరి. ద్రౌపదికట్టిన పుట్టమును సభలో దుశ్శాసనుఁడు లాగెను. ఆమె యాపద్బాంధవుఁడగు శ్రీకృష్ణుని స్మరించెను. భగవంతుఁడామె కక్షయవస్త్రదానము చేసెను. లాగఁబడిన కోకలామేటి పర్వతమువలెఁ బెఱిగినను ద్రౌపది కవమానము జరుగ లేదు. దుశ్శాసనుని కాలుసేతులు నిస్సారము లయ్యెను. “దుశ్శాసనుని ఱొమ్ము పగిల్చి యుద్ధమున సుయోధనుఁడు చూచుచుండ నెత్తురు గ్రోలెద”నని భీముఁడు శపథంబుసేసెను. కుపితుఁడై దుర్యోధనుఁడు “తనతొడపైఁ గూర్చుండు” మని పాంచాలికి సైగచేసెను. “యుద్ధమున వాని తొడలు విఱుగగొట్టెద”నని భీముఁడు మరల శపథము గావించెను. ఈకోలాహలమును విని ధృతరాష్ట్రుఁడు భయమంది విదురునివలన కొడుకుల దుర్నయము నెఱింగి ద్రౌపదిని రావించి యోదార్చి పాండవుల దాస్యవిముక్తులగునట్లును వారి రాజ్యమును వారనుభవించునట్లును వరమ్ములిచ్చి ధర్మజుని రావించి ‘దుర్యోధనుఁ డొనర్చిన తప్పునకు మనంబునఁ గోపమూనకు’ మని బుజ్జగించి యింద్రప్రస్థమున కంపెను.

## పు న ర్ద్యూ త ము.

దుర్యోధనుఁడు తనప్రయత్నమంతయును వ్యర్థమగుటకుఁ జింతించి తండ్రికడకుఁ బోయి యేకాంతమ్మున నిట్టులనియెను. “తండ్రీ! యుద్ధమున నన్నును దుశ్శాసనుని జంపుదు” నని శపథముగావించిన మహాశూరుఁడగు భీముఁడు నీచేవిముక్తుఁడై వేటువడిన సింగంబువోలె నిజపురమ్మున కరిగెను. ఇఁకఁ గౌరవ కులమ్మునకుఁ జావుసన్నిహితమైయున్నది. పాండవులను మరల రావించి జూదమున నోడించి యడవులపాలు సేయమైతిమేని మాబ్రతుకుట సంశయం”బని చెప్పి వెక్కి వెక్కి యేడ్చెను. పుత్ర మోహంబును బాండవులబలపరాక్రమములనుదలంచి ధృతరాష్ట్రుఁడు సుయోధనునితో నేకీభవించి పాండవులను మరలరావించెను. సుయోధనుఁడు ధర్మజుని జూదమునకుఁబిల్చి యోటువడిన వారు పండ్రెండువత్సరములాయుధమాత్రసహాయులై నారచీరలతో నరణ్యవాసమును, జనపదంబున నొక్కయేడజ్ఞాతవాసంబును పదమూఁడవయేట నజ్ఞాతవాసమ్మునఁ దెలియఁబడిరేని తిరిగి యరణ్యవాసాదుల నొనర్చునటులఁ బందె మిడుకొని మాయాద్యూతమ్మున నజాతశత్రువునోడించెను. విదురునికోరికపైఁ గుంతిని విదురునింట విడిచి ధర్మనందనుఁడు తమ్ములను బాంచాలిని, ధౌమ్యుని వెంటఁగొని యరణ్యవాసమునకుఁ బయనమయ్యెను. అర్జునుఁడు మహాకోపారుణనేత్రుఁడై,

చ. "ఖలులగు కౌరవాధము లకారణవైరముఁ బూనిమమ్ము గా
నలకనుపంగఁ బూనిరి ఘనంబగుయుద్ధమునన్ సుయోధనా
దులఁ బవనాత్మజుండు, మఱి దుష్టునిఁ గర్ణుని నేనుజంపి పు
ష్కలమగు రాజ్యవైభవముఁ గైకొనకున్న మహేంద్రజుండనే"

అని శపథము గావించెను. అతనిపై దివిజులు పుష్ప వృష్టిఁ గురిసిరి. పాండవులు వృద్ధులకు నమస్కరించి శుభాశీర్వాదములఁ బడసి యడవుల కేగిరి.

ఇది సభాపర్వము.

---

అవిఘ్నమస్తు.

# భారతసారము.

## అరణ్యపర్వము.

### ధర్మజుఁడు విప్రులతో నడవి కేఁగుట.

అరణ్య ప్రయాణికులయిన పాండవులు గంగాతీరము నకుఁ జేరి కృతస్నాతులై ప్రమాణాఖ్యవటంబున విడిసియుం డిరి. ధర్మజాదులతో నడవి కేఁగి యచ్చటనేయుండ దలఁచిన విప్రులు వేదఘోషములతో వారలను గలిసికొనిరి. ధర్మజుఁడు సగౌరవంబుగ వారలను బూజించి శుభాశీర్వాదముల నంది విప్రులతో నిట్లనియెను.

క. "అపహృత సర్వస్వులమై
సపత్నుల వికారమున, బ్రచండాటవిలో
విపులఫలశాఖమూలము
లుపయోగించుచును నిష్ఠనుండెదు మాతోఁ.

క. రానేల? వచ్చి నవయం
గా నేల? నివాసములకుఁ గ్రమ్మఱి చనుఁ డు

గ్రానేక పక్షార్థూల భ
యానక వనవాస మర్హామగునే మీకున్.

అపిన బ్రాహ్మణులు 'రాజా! దుష్టరాజ పరిపాలనలో మేముండనోపము. మాకు నీవేదిక్కు. ఆశ్రితులను విడనాడకుము. మా యాహారములను మేమె తెచ్చికొనెదము. జపహోమాది పుణ్యక్రియల మీకు మేలు సేయుచుందుము'మని వేఁడిరి. యుధిష్ఠిరుఁడు వారలను వెంటగొనిపోయి కామ్యకవనంబు ప్రవేశించెను. ఆవనంబున జిరకాలమునుండి వసించి యుండిన కిమ్మీరుని భీముఁడు చంపెను. వారచ్చట నొకపర్ణ యాశ్రమంబు గల్పించుకొని యుండిరి. అడవియందు బ్రతిదినము ను బ్రాహ్మణులకును దమకు నాహారము లభించు తెఱంగునకై ధర్మజుఁడు చింతించుచుండ ధౌమ్యుఁడతనికి సూర్యోపాసనమంత్ర ముపదేశించి ధ్యానింపు మనియెను. ధర్మజుఁ డట్లులొనర్ప నర్యముఁడు ప్రత్యక్షమై "నీ తపమునకు మెచ్చితిని. ఈ పండ్రెండేండ్లును నన్నఫలంబులు నీవంటయింట ద్రౌపదీ స్వాధీనములై సమృద్ధిగా నుండు" నని వరంబిచ్చి చనియెను. యుధిష్ఠిరుఁడు మహా సంతోషంబును బొంది వైశ్వదేవంబుకతన నమృతాశియు విప్రసంతర్పణంబునవిఘసాశియునై మునీంద్రులవలనఁ బుణ్యకథల నాకర్ణించుచుఁ బ్రొద్దుగడపుచుండెను.

## మైత్రేయుఁడు దుర్యోధనుని శపించుట.

ధృతరాష్ట్రుఁడు విదురునిఁ బిలచి "కౌరవులను బాండవులేమి సేయఁగలవా" రన్ని యడిగెను. "పాండవు లపార

బలాఢ్యులు; దైవసహాయులు, నీకొడుకులం జక్కడఁగెరు. దుష్టుఁడగు సుయోధనుని నీవచంపి కురుకుల నాశనమును సర్వక్షత్రియకుల నాశనము దప్పింపు"మని చెప్పెను. అంబికేయుఁడు కినిసి "నీవు పాండవపక్షపాతివి. నీవు నాపురము వెడలి యెందేనిఁ బొ"మ్మని తీవ్రముగఁ జెప్పెను. విదురుఁడు వాయువేగముగల తురగములఁబూన్చిన రథంబునెక్కి కామ్యకవనంబునఁ బాండవులను గలిసి వృత్తాంతమంతయు నివేదించెను. ధృతరాష్ట్రుఁడు పశ్చాత్తాపమునంది సంజయుని బంపి విదురుని మరలఁ బిలిపించెను. సుయోధనాదులు "పాండవులతో విదురుఁడు మంత్రాంగముచేసివచ్చె"నని యనుమానించి యుద్ధమునఁ బాండవులను జంపుటకుఁ బ్రయత్నపడిరి. వ్యాసుఁడువచ్చి ధృతరాష్ట్రునకు సుయోధనాదుల దురాలోచనమును దెలిపి "కొడుకులను వారింపు" మని చెప్పెను. అతఁడు వ్యాసునితోఁ "గొడుకులు నామాట వినరు. నీవు చెప్పు" మని వేఁడెను. వ్యాసుఁ "డావని మైత్రేయుఁడొసర్పు" నని నుడివి యేగెను. మైత్రేయుఁడు వచ్చి సుయోధనాదులతో నిట్టులనియె. "కుమారులారా! పాండవు లపార బలులు. వారల నెదురుటకు త్రిమూర్తులు నోడుదురు. మనుష్యమాత్రులరగు మీరు వారి నొంపఁ జాలరు. వారలతో సఖ్యంబు సేసికొని మీ కులము నుద్ధరించుకొనుఁ" డని చెప్పుచుండ సుయోధనుండు నవ్వెను. మైత్రేయుఁడు కోపించి "ఈ యవ

రాధంబున నాహావంబగును. అందు భీమగదా ఘాతంబున నీ యూరుయుగము భగ్నమగు"నని శాపమిచ్చెను. ధృతరాష్ట్రుండు వగచి యమ్మహాత్ముని శాపమోక్షము వేఁడిన,

తే. గీ. "కడఁగి సుబుద్ధి వీనికిఁ గలిగె నేనిఁ
గాదు శాపఫల మట్లుగాక బుద్ధి
హీనుఁడై గర్వితుఁడగునేని శాప
మవ్యవాహఫలంబు వీఁడనుభవించు"

అని యనుగ్రహించి యటనుండి లేచిపోయెను.

## ఈశ్వరుఁ డర్జునునకు బాశుపత మిచ్చుట.

మహావీరులు, నజేయులు నగు భీష్మద్రోణాదులు పర పక్షంబునఁ జిక్కియుండుటకుఁ జింతించుచున్న ధర్మనందనుఁడు వ్యాసభగవానునిచే బోధితుఁడై యర్జునునితో నిట్లనియెను. "ఇంద్రనందనా! ఈ వ్రతాంతమున మనకును, గౌరవులకును దప్పక కయ్యంబగును. భీష్మద్రోణకృపులు మహాస్త్రవేత్తలు. వారల యుక్తిచేతఁ గౌరవపక్షమునఁ బోరుదురు. కావున నీవు మహానియమంబులోఁ బ్రాగుదీచీ దిశలకేఁగి యింద్రాది దేవతల ప్రసాదంబున మహాస్త్రసంపాదనము సేయుము. వ్యాసుండు నాకుపదేశించిన మంత్రము నీకుఁ జెప్పెద" నని యుపదేశించెను. పార్థుండు ప్రీతుండై తూర్పు వైపునకుఁ బోయి పోయి యింద్రకీల మను పర్వతము నెక్కి యింకను బోవ నుంకించుచుండ "బోకుము పోకు" మని యొక యంబర వాక్కు విని

బడెను. అర్జునుఁడు విస్మితుఁడై వినుచుండ ముంగిట నొకదివ్య వృక్షంబుక్రింద వృద్ధబ్రాహ్మణుం డొకండు గన్పడెను. వాని కతఁడు నమస్కరించి యెదురుఁ గూర్చుండెను. అప్పుడు పార్థునితోఁ విప్రుఁడిట్లనియె. "ఈశైలంబు శాంతితపస్వులకు నిలయంబు. ఇచ్చట నీవు బాణబాణాసన కవచంబులతో నుండఁ జనదు. వానిని విడువు" మనెను. ఆ విప్రుని వచనమ్ములకు సంచలింపకున్న యర్జును ధైర్యమునకు మెచ్చి విప్రరూపుఁడగు నింద్రుఁడు నిజరూపమ్మునుజూపి "నీయిష్టవరములఁ గోరు" మనియెను. అర్జునుండు "దేవా! నాకు నీ ప్రసాదంబున దివ్యాస్త్రలాభంబు గావలయు" నని కోరెను. ఇంద్రుం 'డది యేల? పుణ్యలోకంబులు, దేవత్వంబులు, సర్వకామంబులు, వేఁడు" మనిన, నర్జునుఁడిట్లనియె. "అవియెల్ల నాకేటికి! పరమాస్త్రలాభంబ కరమభీష్టము. శత్రుజనులు చేసిన పరిభవ కష్టంబులు చూడజాలక కాఅడవులందు సోదరుల విడిచి వచ్చితిని. నాయభీష్టమును దీర్పు" మని వేఁడెను. "అట్లైన నీశ్వరుఁడు లోకపాలురతో నీకుఁ బ్రత్యక్షమై నీ యభీష్టంబుఁ దీర్పఁగలడు. యోగశక్తి నగ్గిరిజాధవుఁ బ్రసన్నునిఁ జేసికొను" మని యగోచరుండయ్యెను. నాలుగు మాసంబు లర్జునుఁడు ఘోరదీక్షబూని యోగశక్తినిఁ దపంబుచేసెను. ఈశ్వరుఁడు కిరాతరూపమ్మునఁ వచ్చి మూకుండను రక్కసుని మాయా వరాహ రూపమ్మునఁ దపోభంగము సేయు మని నిరా

గింప నతఁడట్లొనర్చెను. అర్జునుఁడు కినిసి బాణంబు నేయ 'నేయకు మేయకు' మని కిరాతుండు నొక బాణంబువిడిచెను. ఒక్కసారిగా రెండు బాణంబులు దాకి సూకరము దిర్దిరందిరిగి రాక్షసరూపము నొందెను. అర్జునుఁడాశ్చర్యమునొంది చూచుచుండ మహాతేజంబునఁ గిరాతుఁ డంగనాజన సహితుండయి యతని డాసెను. వానిగని "నీవెవ్వండవు? ఈయడవిలోఁ గాంతాసహితుఁడవై యేలయుంటివి? మృగయాధర్మ విరోధమ్ముగ నే నేసినమృగమునే నీవేల యేసితి" వని పార్థుఁ డడిగెను.

ఆ. వె. "ఏను నామృగంబు నేసితి నది మదీ
యాస్త్రనిహతమయ్యె నది నెపముగఁ
జనునె నీకు లేని శౌర్యసంపదఁ జెప్పి
కొనఁగ మదము వలుకఁ గుజను నట్లు

మాటలతోఁ గాదు. నీకు బీరంబు గలదేని నాతోఁ బోరు" మని శరములఁ బ్రయోగించుచుఁ బినాకి కిరీటినిఁ దాఁకెను. అర్జునుఁడు తీవ్రశరములఁ గురిసిన నవియెల్ల బర్వతమ్మునఁగురిసిన వర్షమట్లును, అవివేకుల కుపదేశించిన సుభాషితము లట్లును వ్యర్థములయ్యెను. అర్జునుఁడదిగని 'యితఁడు పరమేశ్వరుఁడో, యింద్రుఁడో కావలయు. కాకున్న మరియొక మానవుఁడు నా శరముల కోర్చి చలింపకుండునా!" యని రోషమ్మున నొడుగఱచి మహాస్త్రమ్మున నేయఁ బోవఁ దన

యక్షయతూణీరమున బాణములు లేకుండెను. అగ్నిదత్తమగు నక్షయతూణీరము బాణరహితమగుటకు వగచి గాండీవము చేతఁగొని కిరాతునిపై గలియఁబడెను. ఆ గాండీవమ్మును మాయమయ్యెను.

క. అపహృతగాండీవుఁడు నై
యపరిమిత క్రోధహృదయుఁ డర్జునుఁడు పరం
తపుఁ డెఱుకు మస్తకంబునఁ
గృపాణపాతంబుఁ జేసెఁగిట్టి కడంకన్.

అదియును వ్యర్థమగుటఁజూచి వృక్షముల తోడను శాలతోడను ఘోరమ్ముగ విసరెను. అవియు నక్కిరాతుని గలంపలేకపోయెను. అందుపైఁ గోపించి,

క. హారుఁ బెనఁగి పట్టుకొని భీ
కరబలుఁ డర్జునుఁడు ముష్టిఘాతంబుల సం
గర మొనరించెను వనచర
వరు లాతని శౌర్య గౌరవముఁ బొగడిరెదన్.

కపట కిరాతుఁడు తన దివ్యగాత్రమున నర్జును తనువుఁ బొదిచిన నతఁడు మూర్ఛితుఁడై క్రిందబడియెను. తఱువాత నీశ్వరుఁడు పార్థుని బలపరాక్రమ ధైర్య స్థైర్యములకు మిగుల బ్రీతుఁడై యతని నేదఁదీర్చి యతనిచే నభ్యర్చితుండై వాని కక్షయతూణీరములును గాండీవమ్మును మరలనిచ్చి పాశుపత మను దివ్యాస్త్రము నొసంగి యదృశ్యుండయ్యెను. పిమ్మట

నింద్ర యమవరుణులు ప్రత్యక్షమై వారుణ దండ కుబేరాస్త్రములనొసంగి 'కర్ణాదిశూరులును యక్ష రాక్షస గంధర్వాంశజులైన రాజులందఱును నీచే హతులగుదు' రని వరంబుల నిచ్చి యగోచరులైరి. అర్జునుఁడు కృతకార్యుఁడయ్యెను.

అర్జును నూర్వశి శపించుట.

ఇంద్రుఁడు వెంటనే తన దివ్యరథంబును బంపి "యర్జునుని సురపురంబునకుఁ గొనిర" మ్మని సారథి యగు మాతలి కాజ్ఞాపించెను. అతఁడు వాసవి యొద్దకు వచ్చి యింద్రునాజ్ఞ నతనికిఁ దెల్పి మహాగౌరవంబుగ నాహ్వానించి పార్థు నరదంబుపై నెక్కించుకొని వాయువేగంబున నమరావతికిఁ గొనిపోయెను. మహేంద్రుండు మునిగణంబులతో నెదురేఁగి ఫల్గునుని గౌఁగిలించుకొని తన యర్థసింహాసనమునఁ గూర్చుండఁ బెట్టుకొనియెను. మహా తపోధనులకుఁగూడ దుర్లభంబగు నింద్రసింహాసనమెక్కిన పాండుసుత మధ్యమునిఁ జూచుటకు సకల మునిగణంబులు వచ్చి యధిక సంతోషమున నతనికి విజయాశీర్వచనము లొసఁగిరి.

క. నరుఁడైన యాది ముని యని
హరిసుతుఁడని హరిసహాయుఁడని హరుచేతన్
వరములు వడసిన వాఁడని
సుర లెల్లను వచ్చి పార్థు జూచిరి ప్రీతిన్.

అర్జునుఁడు కడు నాదరంబున సుర సంఘంబు నభినందించి పవలంతయు స్వర్గవిశేషంబులం జూచుచుఁ గాలంబు పుచ్చి రాత్రి సెజ్జగీమున కేఁగి దివ్యతల్పంబునఁ బరుండెను. అంత నూర్వశి దివ్యవస్త్రమును గట్టి మందగమనంబున నతని శయ్యాగారంబునం బ్రవేశించెను. అప్పురుషసత్తముఁడు భయభక్తిసంభ్రమంబులతోఁ బ్రత్యుత్థానంబును దండప్రణామంబునుం జేసి చేతులు మొగిడ్చి యా సురవేశ్యతో నిట్టులనియెను.

క. "ననుఁ బుత్రస్నేహంబున
మనమున మన్నించి శుభసమగ్రునిఁజేయన్
జనుదెంచితివి ముదమ్మున
జనయిత్రీ! యేఁ గృతార్థ జన్ముఁడనైతిన్."

అని చెప్పెను. ఆమాటలకు మనంబున నులికిపడి యూర్వశి దీనవదనయై యర్జునునితో,

చ. అనుపమశౌర్య! నీదు సముదగ్రగుణంబులు నారదాది స
న్మునివరులెల్లఁజెప్పఁగఁ బ్రమోదమునన్ భవదీయదర్శనం
బనిశముఁగోరుచుం దగఁ బ్రియంబున వచ్చితి నేనుగోరఁగా
నను జనయిత్రి యంచు నొక నాయముఁ బల్కెదు వక్రభాషలన్."

అని కోపగించుకొని 'నన్నవమానించితివి. కావున నీవు మానవర్జితుఁడవై మనుష్యలోకంబున బురుష రూపం

బునువిడిచి మానినీ మధ్యమ్మున నుండు'మని శపించియచ్చోటు వాసిపోయెను.

మరునటి యుదయమున నిందుృడు కొమరుని జితేంద్రియత్వమునకు సంతసించి 'అజ్ఞాతవాస వత్సరమున మాత్రమాశాపము వర్తించి శాంతించు'నని శాపమోక్షమనుగ్రహించి యతనికనేక దివ్యాస్త్రముల నొసంగి 'భీష్మద్రోణకర్ణాదులను జయించెద' వని యాశీర్వదించి నివాత కవచులను గూల్చుట కతనిఁ గతిపయదినములు సురపురంబుననుండ నియోగించెను.

ధర్మజుఁడు ధర్మోపదేశముల నందుట.

అప్పటికైదు వత్సరముల క్రిందట మహాస్త్రలాభంబున కరిగిన యర్జునుని జాడలు తెలియక ధర్మజుఁడు మనంబునఁ జింతించుచు ననుజవియోగమునను, శత్రుకృత పరాభవమునను మిగుల దుఃఖము గాంచి యావేశమ్మున ధార్తరాష్ట్రులఁ గూల్చెదనని త్వరపడుచున్న భీమసేనునకుఁ గోపాటోపోపశమనంబు సేసెడు ధర్మజుని కడకు బృహదశ్వుఁడను మునీంద్రుఁడువచ్చి నలదమయంతుల చరిత్రమును జెప్పెను. నారదుఁడువచ్చి భూప్రదక్షిణ తీర్థయాత్రల మహాత్వంబును బోధించెను. రోమసుండను మహాముని యింద్రుని పంపున ధర్మజుని యొద్దకువచ్చి యమరపురంబునఁ బార్థుని సుఖస్థితి నెఱిఁగించి యుధిష్ఠిరున కనేక ధర్మసూక్ష్మంబుల నుపదేశించి యతనితో

దీర్ఘయాత్రాభిగమనంబొనర్చెను. యాత్రాచరణ కాలంబున యమసూనునకు రోమశుండగస్త్య, భగీరథ, కపిల, ఋష్యశృంగ, పరశురామ, శాకన్య, చ్యవన, మాంధాతృ, సోమక శిబి, యయాతుల సుచరిత్రంబులు కర్ణపేయములుగ నెఱింగించెను. భీముఁడు గంధమాదన పర్వతప్రాంతముల ననేక యక్షరాక్షసులతో యుద్ధముచేసి జయమును గాంచెను. జటాసురుఁడను క్రూర రాక్షసుని వధించెను.

## నివాత కవచ వధ

అటనర్జునుండు మునిబృందారక గణంబులచేఁ బ్రార్థితుండై దేవతలను విస్తారము బాధించుచు వారలకజయ్యులై యున్న నివాతకవచులను దుష్టదానవుల వధించుటకింద్రుని దివ్యరథంబు నధిరోహించి మాతలిని సారథిగాఁగొని సముద్రమధ్యమున వారు నిర్మించుకొనియున్న భద్రమందిరముఖద్వారమ్మున నిలిచి దేవదత్తమును బూరించెను. ఆమహాధ్వనికిదిక్కులన్నియుఁ బిక్కటిల్లుటంజేసి దానవులదరిపడి యుద్ధసన్నద్ధులై యొక్కుమ్మడి నక్కిరీటిఁ దాకిరి. గాండివి గాండీవముక్త క్రూరనారాచంబులచే సురవిరోధులను వెఱగుపడునట్లు కొట్టెను. రాక్షసులు క్రమయుద్ధమున నతని జయింపఁ జాల రని తలంచి మాయాసమరంబునఁ జెట్టులను, రాలను, వర్షంబును గురియుచుఁ జీఁకటులు గల్పించుచు ననేక విధములఁ [illegible] పఱుప నారంభించిరి. ఇంద్రతనయుండు కలికాగ్నేయాస్త్ర

మహాస్త్రమ్ములచేఁ వారిమాయలను బటాపంచలుసేసి సురల
కజేయులగు దానవులనర్జునుఁ డతి భీకరముగఁ దునుమాడి
విజయంబును గాంచెను. మాతలి యర్జునుని మహాపరాక్రమ
శక్తికానందించి రథమ్మును సురపురమునకు మరల్చెను.

## పౌలోమ కాలకేయుల వధ.

అర్జునుఁడు మరలి వచ్చుచున్నప్పుడు త్రోవలో నొక్క
మునివనంబును విచిత్రమగు పురంబును గన్పడిన "నవియెవ్వరి"
వని యతఁడు మాతలినడిగెను. మాతలి "మున్ను పౌలోమయు,
గాలకియు నను నిర్వురు దానవాంగనలీవనంబున ఘోరతపంబు
సేసి, తమ కొమరుల కమరులచేతఁ జావు కల్గకుండునట్లు వరం
బులంగొనిరి. అది కారణంబుగా నఱువదివేల దానవులీపుర
మున వసించి సురలను బాధించుచుందు" రని యర్జునునకుజెప్ప
నతఁ డరదమ్మును వారిపైకురికించి వారలఁ దాకెను. పౌలోమ
కాలకేయులు కొంతవడి సంగరమ్ము నడిపి తమ పురమ్ముతోఁ
గూడ దివమ్మునకేఁగి యదృశ్యులైరి. దానవి వారల మాయ
లకచ్చెరువంది యసాధ్యులుగాఁ దలంచి యీశ్వరుని మనం
బున ధ్యానించి పాశుపతము నభిమంత్రించి విడిచెను. ఆమ
హాస్త్రము భూత ప్రేత పి[illegible]చాద్యనేక రూపమ్ములుగా వెడలి
యద్దానవుల నంతకాలయమున కనిచెను. విజయుండు విజ
యుఁడై దివిజపురమ్మున కేఁగి దివిజ, ముని, సిద్ధ సాధ్యగణం
బులచే స్తుతింపఁబడి యింద్రునిచేఁ గౌఁగిలింతలేకుండ సమస్త

దివ్యాస్త్రములనంది తదనుజ్ఞాతుఁడై నిజసోదరులకడ కరుదెంచి తానొనర్చిన దేవకార్యములను సవిస్తరముగ నగ్రజులకెఱింగించి తాఁగొనిన దివ్యాస్త్రము లన్నియు ధర్మజాదులకుఁ దెల్పెను. వారలు తమకు సర్వరాజ్య సంపదలును గలిగినటుల సంతసించిరి.

## అజగరోపాఖ్యానము.

హిమవత్పర్వత ప్రాంతములకు భీమసేనుఁ డొకనాఁడు వేఁటాడుటకేఁగి యచ్చట నొక సర్పముచేఁ బట్టువడి కదలఁ జాలక చింతించుచు నాసర్పముతో నిట్టులనియె. 'ఓసర్పరాజమా! నేను బదివేలేనుంగుల బలము గలవాఁడను. అనేకక్రూర రాక్షసుల నాహవంబునఁ గూల్చి దర్పితుఁడనై యుంటిని. నాయట్టివానిని నీవు స్వబలంబునఁ బట్టఁ జాలవు. నీకెద్దియోని పరబల ముండవల్లయున్నను తను దౌర్బల్యము నాకే వింతఁ గొలుపుచున్నదీ. నీ యుదంతమును జెప్పు" మనెను. ఇంతలో ధర్మనందనుఁడు భీముఁడు తడవు వసలుటకుఁ గారణమును యోజించుచుండ నక్క కూఁతయొకటి వినఁబడెను. ఈయపశకునంబున నేదియో కీడు మూడునని యూహించెను. పిదప దక్షిణభుజ మదరుటచేతఁ గీడులో మేలగుననితలంచి యర్జున నకుల సహదేవులను, ద్రౌపదీ రక్షణార్థంబుగా నియోగించి ధౌమ్యుని సహాయముఁ గొని భీముని పాదముల జాడంబట్టి పోయి పోయి ముందట సర్ప

బద్ధుడై కదలజాలకున్న భీమునిఁగాంచి యాశ్చర్యదుఃఖముల నంది యాసర్పంబుతో నిట్లులనియెను. "అయ్యా! నీవు సర్ప రూపంబు దాల్చి దైత్యుండవో, దేవతవో యగుదువు. నేను ధర్మజుండను. ఇతఁడు నాయనుజన్ముండు. నీ వీతని నామిషార్థము పట్టితివేని నీకు వలసినంత యాహారమును సమకూర్చి నేనిచ్చెదను. వీనిని విడువు" మని వేఁడెను. ఆ యజగరమ్ము మనుష్యవాక్యమ్ములతో యుధిష్ఠిరున కిట్లని యెను. 'దేవా! నేను నహుషుఁడను చక్రవర్తిని. ధనమదమ్మునం జేసి సహస్రబ్రాహ్మణకృతమైన బ్రహ్మరథము నెక్కి బ్రాహ్మణుల కపచారము గావించితిని. అగస్త్యుఁడలిగి నా కిట్టి శాపం బిచ్చెను. కడు భీతుండనై శాపానుభవకాలమ్మున నా యెదుటఁబడెను. సమస్త జీవులును బలహీనములై నాకు స్వాధీనమగునట్లు ననుగ్రహించి శాపమోక్షమును దయ సేయు' మని ప్రార్థించితిని. అతఁడట్లనుగ్రహించి "నీ ప్రశ్నంబుల కుత్తరమిచ్చెడు మహానుభావుఁడు నీకు లభించి నపుడు శాపమోక్షమగు" నని యానతిచ్చెను.

చ. చదివితినెల్ల వేదములు సత్క్రియఁ జేసితి నూఱుయజ్ఞముల్
విదితముగా సురేంద్రపద వీస్థితిఁ బొందితి దుర్మదంబునన్
దుదిఁ బెనుబామనై యధికదుఃఖితుఁడైతి సుఖంబుదుఃఖమున్
వదలక చేయుచోట బలవద్విధి కేమిభరంబు సెప్పుమా !

ఆ కారణంబున పెద్దకాలంబునుండి యిటవసించి యనేక జీవంబుల నాహారంబుగాఁ గొంటిని. అదృష్టహీనుండనై నేఁడు

నీతమ్ముఁడు నాకు భక్ష్యంబయ్యె. నాప్రశ్నంబులకుఁ బ్రత్యు త్తరమిచ్చి వీనిఁ గొని పొమ్ము. నాకును నీ తమ్మునకుఁ గూడ నుపకారంబు సేసినవాఁడవగు" మని ప్రార్థించెను. ధర్మజుఁడు భ్రాతృరక్షణార్థం బట్లొడంబడుటం జేసి నహుషుండు (1) ఏ గుణంబులు గలవాఁడు బ్రాహ్మణుండు? అతని కెఱుఁగఁదగిన వస్తు వేది? (2) బ్రాహ్మణగుణంబులు శూద్రు నందుఁ గలుగు నెడల నతండుత్తమద్విజుఁడు కానేర్చునా? అటులయిన వర్ణభేద మేల్లేర్పడగలదు? (3) అప్రియత్వము ననృతవాదిత్వముగలవాఁడయ్యును, నహింసకుఁ డధికుఁడగుట యెట్లు? అహింస కా యాధిక్యమేల గలిగె? ఈ ప్రశ్నంబుల కుత్తరంబులు చెప్పుమని వేఁడెను. ధర్మజుఁడా ప్రశ్నం బులను విని "సత్యము, క్షమ, దమము, శౌచము, దయ, తపము, దానము, శీలము లెవనియందు వర్తించునో వాఁడు బ్రాహ్మ ణుఁడు. దుఃఖములందు విమోహముగాంచకుండుటయు వానికి వేద్యము. ఈగుణములు గలిగిన శూద్రుఁడును తద్గుణ రహితుఁడగు బ్రాహ్మణుఁడును సచ్ఛూద్రులగుదురు. ప్రమాదంబున నాయా వర్ణములకుం బతనంబు గలిగినపుడు వారలకు వృత్తంబు స్వాయంభువుండైన మనువు సెప్పెను. మఱియు దానము, ప్రియముసేత, సత్యము, నహింసలను నాలుగును సమానములే గాని యహింసాఫల మధికము. దానాది గుణంబులు గలిగి యహింసాపరుఁడైనవాఁడు దేవగతినందును

అవిగాంచియు హింసకుఁడగువాఁడు తిర్యగ్జంతువులం బుట్టు" నవి ప్రత్యుత్తరములు సెప్పి భీమునకు బంధమోక్షమును, నహుషునకు శాపమోక్షము నొసంగి తమ్ముని ధౌమ్యునిఁ గొని నివాసంబున కరిగెను.

## మార్కండేయోపదేశములు.

తరువాత మార్కండేయుం డను ముని యుధిష్ఠిరుని జూడవచ్చి యతనికి నత్రి గౌతమ సంవాదమును, వైవస్వతు వృత్తాంతమును, ప్రళయకాలప్రకారంబును, గలియుగ ధర్మంబులును, బ్రాహ్మణప్రభావంబును, నింద్రద్యుమ్న చరిత్రమును, గువలాశ్వచరిత్రంబును, మధుకైటభుల చరిత్రంబును, బుత్ర గుణంబులును, బతివ్రతామహాత్మ్యమును, నహింసాధర్మంబును, నంగిరసు వృత్తాంతంబును. షణ్ముఖావతారఘట్టమును సవిస్తరముగఁ జెప్పెను. ధర్మజుఁడా మహోపదేశంబులను విని సంతుష్టహృదయుఁడై మార్కండేయుని సంస్తుతించెను.

## దుర్యోధన ఘోషయాత్ర.

ద్వైతవన సరోవర తీరంబున ధర్మరాజు మునిజన సహాయుండై "సద్యస్కందం" బను యజ్ఞంబు సేయుచుండెను. అట దుర్యోధనుండు దుస్థితిలో నున్న పాండవ ద్రౌపదులకుఁ దమ మహావైభవమును జూపి వారల నవమానింపఁ దలంపు పుట్టి కర్ణ దుర్యోధన శకునులతో మంతనము చేసి ధృతరాష్ట్రు నొప్పించి యనేక రథ గజ తురగ పాదదళంబులు పరివేష్టింపఁ

దానును దమ్ములను కర్ణాదులును బ్రమద స్త్రీ జనంబులును ఘోషయాత్రకు బయలుదేఱిరి. దుష్టజంతు సంహారంబు గావించుచు వారు ధర్మజుఁడున్న ద్వైతవనసరోవరమ్మున కనతిదూరమ్మున నిల్చి యాసరస్సునొద్దనఁ "బటకుటీరమ్ముల నిర్మింపుఁ" డని సేవకుల నంపిరి. ఆవనంబున కధిపతియగు చిత్రసేనుఁడను గంధర్వుఁడు తన యనుచరుల నంపి " యాకొలను చిత్రసేనుని గ్రీడార్థము నిర్మింపఁబడినది, మీకుటీరముల నచ్చట నిర్మింపఁగూడ" దని కబురంపెను. దుర్యోధనుం డామాట కదిరిపడి " గంధర్వుల నుక్కడించి కుటీరముల నిర్మించునది" యని సైన్యసహాయులగు ననుజుల బంపెను. గంధర్వ బలంబులు వేన వేలు వచ్చి వారలను బాఱఁదోలిరి. తఱువాతఁ గర్ణ దుర్యోధనులు గూడ వచ్చి పోర నారంభించిరి. అనేక గంధర్వులు గ్రుక్కిరి. చిత్రసేనుఁ డలిగి గొప్ప సైన్యముతో వారలఁదాకి సుయోధన, కర్ణ, రాజబంధు, జనంబులుగ్రుక్కునట్లును సైనికులు సచ్చునట్లు గొట్టెను: కర్ణాదులు పలాయనులైరి. సుయోధనుని యంతఃపుర స్త్రీలను విఱచి కట్టి యరదంబులపయి బంధించి దీసికొనపోయిరి. తక్కిన కౌరవులు ధర్మజుని శరణుసొచ్చిరి. ధర్మజుఁడు కరుణించి " దుర్యోధనాదుల విడిపింపుఁ" డని సోదరుల కానతిచ్చెను. భీమసేనుఁడు దుష్టుఁడగు సుయోధనున కుపకార మొనరించుట. తన కనిష్టమైనను ధర్మజుని నియోగము నుల్లంఘింప జాలక యనుజు

లతో నరిగి గంధర్వసైన్యంబులతో ఘోరమగు పోరు సలిపి వారల నిర్జించెను. చిత్రసేనుఁడు పాండవులకు ప్రసన్నుండై "ఇంద్రుని పంపుల మీకపరాధియగు నీ దుర్మార్గుని బంధించి తిమి. మీరుమగుఁ"డని జెప్పెను. ధర్మరాజాదులు "మేము యుధిష్ఠిరు నాజ్ఞను మిమ్ము నెదిరించి సుయోధనాదుల గొని పోవ వచ్చితిమి. నీవును వీరలతో నమ్మహాత్ముని కడకు వచ్చి యాయన యనుమతిని వర్తింపు" మని ప్రత్యుత్తరమిచ్చి వారం దఱను వెంటఁ గొనివచ్చి ధర్మజున కొప్పగించిరి. యుధిష్ఠిరుఁడు చిత్రసేనుని గౌరవించి సుయోధనాదులకు బంధమోక్షము గావించి.

ఉ. ఎన్నఁడు నిట్టిసాహసములింక నొనర్పకుమయ్య దుర్జనుం
డన్నన సాహసక్రియలందుఁ గడంగి నశించుఁ గావునన్
గ్రన్ననఁదమ్ములన్ దొరలగై కొని యిమ్ములఁబొమ్ము వీటికిన్
సన్నుతదీనికొండొక విషాదముఁ బొందకుమీ మనంబునన్.

అని మందలించి వీడ్కొలిపెను.

పాండవులు సైంధవునిఁ పరిభవించుట,

గంధర్వులచేఁ పరాజితుండైన రాధేయుఁడు పాఱిపోయి పాండవులచే విడపింపఁ బడిన సుయోధనునిఁ గలిసికొనియతఁడు గంధర్వులను నిర్జించి జయముసు గాంచి వచ్చినాఁడని తలంచి సుయోధనుని స్తోత్రము సేయఁ దొడంగెను. అతఁడు సిగ్గు

వడియుఁ దన పరాభవమును సొంతముగా మితుౖన కెరింగించి ప్రాయోపవిష్ణుఁడయ్యెను. రాధేయుం డతని వారించి కరి పురంబున కరిగెను. దుర్యోధనుని మఱఁది యగు సైంధవుఁడు భార్యాగ్రజుని పరిభవంబునకు వగచి పాండవులనువంచింపనెంచి వారలున్న యడవికి వచ్చెను. పాండవులేవురును మృగయార్థ మేగిరి. ధౌమ్యుఁడు సమిధలు తేఁబోయెను. ఒంటరిగా నింట నున్న పాంచాలి యొద్దకు సైంధవుఁడు వచ్చెను. ద్రుపదరాజు పుత్త్రి తన యాఁడుబిడ్డయగు దుస్సల పెనిమిటి సైంధవుఁడు తమ యింటికి వచ్చెగదాయని వాని కర్ఘ్యపాద్యముల నిచ్చెను. ఆదుష్టుఁడు సోదరియనియెఱు సేవింపక యామెకుఁ దన యభి మతంబును దెలిపెను. ఆపతివ్రత వాని నెన్నియో సదుపదేశం బుల వారించినను లెక్కసేయక యామెను బలిమినిఁ బట్టి తన రథంబున నిడుకొని సైన్యములతో రయంబునఁ బోవుచుండెను. ఇంతలో ధౌమ్యుఁడువచ్చి కేకలిడుచుఁ బాండవులను రోయుచు నిటునటు నాతురంబునఁ దిరుగుచుండెను. పాండవులు తమపర్ణ శాలకు వచ్చి ధౌమ్యునిచే వృత్తాంతము దెలిసికొనిరి. ధర్మజుఁడు "వైళంబపోయి యా సైంధవపశువును జంపకుండఁ ద్రనకడకుఁ గొనిరం"డని తమ్ముల కాజ్ఞాపించెను. మహావీరులైనభీమార్జున నకులసహదేవులుధనుర్విముక్త తీవ్రనారాచంబులువోలె సైంధవ హతకునిఁ దాకి వానిసైన్యంబులను నుగ్గునూఁచగాఁ జిదిమి సైంధవునిఁ బ్రాణావశిష్టునిఁగా బట్టి ద్రోవదినిఁ జెఱనుండి

తప్పించి యుధిష్ఠిరుని యొద్దకుఁ గొనివచ్చిరి. ధర్మజుఁడు వాని నువ్వ నాఁడెను. భీముఁడు పిడికిళ్ళతోడను మోకాళ్ళతోడను వానినిఁ జితుకఁగొట్టి యేకపక్ష క్షౌరంబును జేయించి యింకను బాండవదాసుఁడను నామంబుతో బ్రతుకుమని విడిచిపుచ్చెను.

## సైంధవున కీశ్వరుఁడు వరమిచ్చుట.

సింధురా జచ్చోటు వాసి గంగానదీ తీరమ్మున కరిగి యతి నిష్ఠాపరుడై పాదాంగుష్ఠంబున నిలిచి ఘోరమ్ముగా దపమాచరించెను.

ఉ. వానికి నమ్మహేశ్వరుఁడు వత్సలుఁడై పొడసూపియాప్పితం
బైనది వేఁడు మన్న నతఁడానతుఁడై పరమేశ! విక్రమా
హీనులఁ బాండునందనుల నేపుర సైన్యయుతంబుగా ననిం
బూనిజయించునట్టివరముం గృపసేయుమునాకునా వ్రుడున్.

అప్పరమేశ్వరుఁడు సింధురాజుతో “ నిది పొసగదు. పాండునందనులను గదనమ్మున జయించుటకు కింద్రాదిదివిజులకు గూడ నశక్యము. నానుడువున నీ యిష్టంబునుం దీర్ప వల యును. కావున,

చ. విజయుఁడ్లొకండుదక్క నతివీరుల బార్థులనున్న నల్వురన్
నిజమొక నాటికయ్యమున నీవుజయింపుము ఫల్గునుండు స
ర్వజగ దజయ్యవిక్రముఁడు వానినెదుర్కొనినాకునైనఁబో
రజితునిఁ జేయుటెంతయు భరంబగు నిక్కముపల్కితింజుమీ.

అతని కీర్తి ప్రభావంబు నాయనుగ్రహంబునఁ గలిగెను. అదియునుగాక సర్వ సమర్థుఁడగు శ్రీకృష్ణుఁ డతనికి సహాయుఁడుగా నుండ వాని వంకఁ దేఱిచూచుట కైన నెవ్వరును శక్తులు కారు. పొమ్మని యదృశ్యుండయ్యెను. సింధుపతియు నిజపురంబున కరిగి ప్రచ్ఛన్నముగ నుండెను. సైంధవునివలన ద్రౌపదికి గలిగిన భంగపాటునకు జింతించుచున్న ధర్మజునిఁ జూచుటకు మార్కండేయుఁడు వచ్చి యా కథయంతయు విని తొల్లి రావణాపహృతయగు సీత కష్టములును రామవిజయము జెప్పి యాతని నూరడించి పతివ్రతయగు సావిత్రి పొందిన కష్టములును తుదకుఁ బొందిన సౌఖ్యములును జెప్పి ద్రౌపది "సావిత్రివోలె దన పతివ్రతా మహాత్వమున మిమ్ము నుద్ధరింపఁ గల" దని చెప్పి పోయెను.

విప్రుని యరణిఁ దెచ్చుటకు ధర్మజుఁ డేగుట.

ఇట్లు మునిప్రోక్త సత్కథలను వినుచు ద్వైతవనంబున సోదర సమేతుఁడై కూర్చుండి యున్న ధర్మనందను పాలికిఁ దత్తరపాటుతో నొక బ్రాహ్మణోత్తముఁడు వచ్చి "రాజా! చెట్టునకు దగిలించిన నా యరణి నొక మృగంబు చెట్టున కొడలు రాచుకొని కొమ్మునకుం దగిలిన దానిఁ గొని పర్విడి పోవుచున్నది. మీరేఁగి దానిఁ గూల్చి నాయరణిఁ దెచ్చి పెట్టుఁడు. నాకు నిత్యవిధిలోపము జరుగకుండఁ గాపాడుఁ" డని వేఁడెను.

చ. అనవుడు నాక్షణంబ మనుజాధిపుఁ డుద్ధతచాపహస్తుఁడై
యనుజులుఁ దాను నెంతయు రయంబున నాహరిణంబుపజ్జఁగాఁ
గొనిచని కూడముట్టి మెఱుఁగుల్ నిగుడంబటుసాయకంబు లే
సిన నొకయమ్మునమ్మృగము సెందదచేరద యద్భుతంబుగన్.

పాండవు లేవురు నామృగమును దఱిమి తఱిమి దాని నేమియుఁ జేయఁజాలక డస్సి యొక్క వటవృక్షము నీడఁ గూలఁబడిరి. ఆ హరిణము వనమధ్యమ్మున నదృశ్యంబయ్యెను. నకులుఁడు డస్సి యున్న యగ్రజునిఁ జూచి "అకటా! మనకిట్టి కష్టములు గలుగుటకు మూల కారణ మేదియో కదా!" యని చింతించెను. భీమార్జున నకుల సహదేవులు పౌరుషంబున నిట్లాడిరి.

ఆ. వె. ప్రాతిగామివోయి పాంచాలిఁ గొలువులోఁ
పలికిఁ దేర నపుడ యలుక యెసఁగ
నాంబికేయ సుతుల నందఱఁ దునుమ కే
[illegible]వికి నిట్టి యడరు మనకుఁ బుట్టె.

చ. అనవుడు గర్జునుండనియె నాసభ సూతసుతుండు పేర్చి ప
ల్కినపటువాక్యముల్వినియుఁగినుకనుబూనక యేదొలంగి కా
ననమున నిట్లు కాతరజనంబుల చాడ్పున నేఁగుదెంచుటన్
మనకు దురంతదుఃఖములు మానక పైకొనివచ్చెఁ దమ్ముఁడా!

ఆ. వె. దుష్టశీలుఁడైన దుర్ద్యూతకితవు గాం
ధారుఁ బట్టి యేచు దడయ కపుడ

తునుమ కునికి నిట్టి దుర్దశ ప్రాలైతి
మనఘు మనము కాననాంతరముల

ఇట్లు వలువురు నాలుగు తెఱంగుల నాఁడుచుండ "దాహపీడితులైన తమ్ములకు నుదకంబులుగొనిర"మ్మని ధర్మజుఁడు నకులున కాజ్ఞాపించెను. అతఁ డేగి ముందట నతిమనోహరంబగు కొలను జూచి నీరు ద్రావఁబోవ నొక్క యశరీరవాక్కు వినఁబడియెను.

క. ఓ యన్న యీ తటాకము
నాయది నీ వీ జలము గొనఁగ వల తేనిఁ
నా యడిగిన ప్రశ్నములకు
ధీయుతయుత్తరము లిమ్ము తేటపడంగాన్.

అను పల్కును లెక్కసేయక నకులుండు నీరుద్రావి నిశ్చేష్టితుఁడై వడెను. ఇట్లు క్రమంబుగా సహదేవార్జునభీములరిగి నకులుని గతినందిరి. పిదప ధర్మజుఁడేగి తమ్ముల పాటునకు దుఃఖించి నీరు ద్రావఁబోవ నయ్యశరీరవాణి యెప్పటియట్ల వినఁబడెను. ధర్మజుఁడు నిలిచి యాభూతమ్ము నాహ్వానించి యతని ప్రశ్నంబుల కుత్తరమిచ్చి సంతృప్తినిఁ జేసెను. భూతంబు యక్షాకారమునఁ బ్రత్యక్షమై "నీ యుత్తరములకు మెచ్చితిని. నీతమ్ములలో నొక్కని బ్రతికించెద వేఁడు" మనియెను. ధర్మజుఁడు "నకులుని బ్రదికింపు" మని కోరెను. యక్షుఁడు బలపరాక్రమవంతులగు భీమార్జునులలో నొక్కని

వేఁడక యట్లు వేఁడితివేల" యనియడిగినఁ "గాంతేయులలో నేను బ్రదికి యుంటిని. మాద్రేయులలో నతఁడు బ్రదుకుట ధర్మంబు గావున నట్లు వేఁడితి" నని బదులు సెప్పెను. వాని ధర్మమునకు మెచ్చి యముండు స్వస్వరూపమునఁ గన్పడి, "కుమారా! నేను యముండను. మిమ్ములను బరీక్షింప వచ్చితిని. నీ తమ్ములు నల్వురును జీవితులగుదురు. మీకు వనవాసాబ్దములు ముగిసినవి. పదమూఁడవది యజ్ఞాతవాసము. మీ రేరూపంబులఁ దాల్తురో యవి కడు నొప్పియుండును. మిమ్ముల నెవ్వరును గుర్తింపఁ జాలకుండునట్లు వరమిచ్చితిని. నీ యిచ్చ వచ్చిన వరము నొండు వేఁడు" మనియెను. ధర్మజుఁడు బ్రాహ్మణుని యరణిఁ దెచ్చియిమ్మనెను. ఆ యరణి నిచ్చినఁ గొని వచ్చి విప్రుని కిచ్చి యాశీర్వాదమ్ము లంది తన్నుఁ బరివేష్టించియున్న విప్రసంఘముతోఁ బ్రొద్దుపుచ్చుచుండెను.

ఇది అరణ్యపర్వము.



అ వి ఘ్న మ స్తు.

# భారతసారము.

## విరాట్పర్వము.

### పాండవులు విరటుఁ గొల్వఁబోవుట.

పాండవులు తమయొద్దనున్న బ్రాహ్మణుల యనుమతిఁ బడసి యజ్ఞాతవాస ప్రయత్నమున నుండ ధౌమ్యుండు పాండవులకు సేవా ధర్మంబు లుపదేశించెను. సేవా ధర్మములం గ్రహించి ధౌమ్యుని వీడ్కొలిపి క్రోశమాత్ర దూరమ్మరిగి యటఁ గూర్చుండి విరటుని పురంబున ధర్మజుండుఁ కంకుఁడను నామమున సన్యాసి వేషంబు తోడను, భీముఁడు వలలుఁడను నామమున వంటలవాని వేషంబుతోడలు, ఫల్గునుండు బృహన్నలయను నామమున నూర్వశీ శాపవిధినిఁ బేడియై స్త్రీలకు విద్య గఱపు చందంబుననుఁ నకులుఁడు దామగ్రంథి యను నామంబున హయ శిక్షక వేషంబునను, సహదేవుఁడు తంత్రీపాలుఁడను పేరున గోపాలుఁడుగను నుండుటకు నిశ్చయించుకొనిరి. ద్రౌపది మాలిని యను నామమున సైరంధ్రీవేషము దాల్చి విరటుదేవి కనుసన్నల వర్తింపు చుండెదనని చెప్పెను. ఇట్లు కృతనిశ్చయులై తమ తమ యాయుధంబులను శవాకారముగఁ గట్టి యొక శమీవృక్షంబున నునిచి భేతాళునిఁ గాపు

వెట్టి యాయా వేషములతో విరాట్పురమున నొక్కరొకరుగా నరిగి జనపాలుని మెప్పించి యతని కొలువునఁ జేరిరి. విరటుఁడును వాని సతి సుధేష్ణయుఁ "పాండవపరిచారుల" మని చెప్పినఁ బాండవ ద్రౌపదులను సగౌరవంబుగఁ దమ కొలువున నిలిపి యుచిత రీతినిఁ బరిపాలింప సమకట్టిరి.

## కీచక వధ.

నకుల సహదేవులు తమతమ విధులయం దప్రమత్తులై విరటుమనంబును మెప్పించి పారితోషికముల నంది రహస్యంబున నగ్రజులకు జూపుచు గోక్షీరమ్ముల సోదరులను సమృద్ధభోజనులఁ జేయుచుండిరి. భీముం డనేక మంది మల్లులను రాజనియోగంబున వధించి యతని మన్ననలకుఁ బాత్రుఁడగుచుండెను. గాండివి కన్యాంతఃపురజనంబులకుఁ నాట్యవిద్య గఱపుచుఁ బరీక్షాకాలమున రాజు మెప్పుల నందుచుఁ గన్యకామణుల గౌరవంబునకుఁ బాత్రత నొందుచు నతి విశ్వాసమునఁ కాలము వుచ్చుచుండెను. ధర్మజుఁడు విరటు నాస్థానమ్మున [illegible] యనేక పుణ్యకథలం గఱపుచు రాజనీతి మార్గమ్ముల నుపదేశించుచు నతనిచేఁ పూజింపఁబడు చుండెను. ద్రౌపది సుధేష్ణయొద్ద నతి వినయమ్మున నుచిత కార్యమ్ముల నిర్వర్తించుచుఁ గప్పువడిన నిప్పువలె మెలంగుచుండెను. సుధేష్ణకుఁ గీచకులను నూర్వురు సోదరులు కలరు. అందు జ్యేష్ఠుఁడొకనాడు సుధేష్ణ మందిరమునకు వచ్చి సైరంధ్రిజూచి

తన యభీష్టముం దెలిపి యామెచే నిందితుఁడై సుధేష్ణతో నిట్టులనియెను. "అక్కా! నీకొలువున నున్న సైరంధ్రి యందు నా మనంబు తగిలినది. ఆమెచేఁ దిరస్కృతుఁడ నైతిని. నాబ్రతుకు నభిలషింతువేని నాపె నొడఁబరపు" మని వేఁడెను. సుధేష్ణ విషాదము నంది, "తమ్ముఁడా ఆమె కేవురు పతులు గంధర్వులున్నారఁట. వార లామెను నీడవలెఁ గాచి యుందురఁట. నీవిట్టి దుర్నీతికిఁ జొరఁ బడితి వేని వారలచే నిహతుండ వగుదువు. ఈ తలంపుడుగు" మని చెప్పెను. అతఁడు గర్వాంధుఁడై "నన్ను జయించు వారు త్రిలోకంబుల లే" రని గర్వించి "యీ సహాయము" చేయు మని యక్కను బ్రతిపాదించెను. ఆమెయు మద్యము నెపమ్మున సైరంధ్రినిఁ గీచకగృహమునకు బంపెను. ఆమూ ఖుఁడామెను బలిమినిఁ బట్టబోయెను. ఆమె తప్పించుకొని వచ్చి యా రాత్రి యుదంతమంతయు రహస్యంబున భీమసేనున కెఱింగించెను. అతఁడు సతితో "జెలీ! వాని కొడబాటు సూపి నర్తనాగారము సంకేతస్థలముగా జెప్పుము. నేను వానిని రహస్యంబుగఁ దుదముట్టించెద" నని చెప్పిన నాపె యట్లొ నర్చెను. భీమసేనుఁడు స్త్రీరూపంబును దాల్చి నర్తనాగార మునకువచ్చిన గీచకునిఁ బరిమార్చెను. వానిసోదరులనునూటఁ యేవురు వచ్చి సోదరకళేబరముతోఁ బాంచాలినిఁ గూడఁ గట్టి స్మశానమునకుఁ గొనిపోవుచుండ భీమసేనుఁడు ముందుగా

నటకేఁగి యొక సాలంబు వెలికి వారినందఱను జంపి ద్రుపదా
త్మజను విడిపించి రహస్యముగ వంటయింట బరుండెను. సోదరుల
వధకుఁ జింతించి సుధేష్ణ పత్యనుమతినిఁ బాంచాలిని రాష్ట్రము
నుండి వెడలిపొమ్మనెను. పిదప యాజ్ఞసేని యజ్ఞాతవాసావశిష్ట
దినములు పదమూడు మాత్రము యథాప్రకారము గడపుట
కనుమతిఁ బొందెను.

## దక్షిణ గోగ్రహణము.

అజ్ఞాతవాసవత్సరమున పాండవులను గుర్తించి తిరిగి
యరణ్యవాసమునకు బంపవలెనను కుతూహలముతో దన సేవ
కుల ననేకులను బంపి పాండవులను వెదుక నియోగించెను.
వారలు తిరిగితిరిగి యెందును గానక వేసరి కరిపురమున కరు
దెంచి సుయోధనున కెఱింగించిరి. అతఁడు విఫలప్రయత్నము
నకుఁ జింతించెను. కర్ణుఁడు "వారలు జీవన్ముక్తులై యుందురు.
మిన్నక సర్వరాజ్యపట్టాభిషిక్తుడవు క"మ్మని సుయోధనునిఁబురి
కొల్పెను. ద్రోణుఁడు "వారలతిగఁజచ్చువారని యూహించుట
బేలతనము. అజ్ఞాతవాసవత్సరాంతముకడునాసన్నమైయున్నది.
ఇఁక పాండవులు వచ్చి చేవయెక్కిన పౌరుషంబున మిమ్ములను
జక్కాడి రాజ్యముఁ గొనగలరు. ఎట్టులేని వారల గుర్తించి
తిరిగి యరణ్యవాసమున కంపిననే మీకు రాజ్యము దక్కు"నని
చెప్పెను. భీష్ముఁడును దుర్యోధనునకు ద్రోణు నుపదేశము
లెస్సయనియు, ధర్మజుఁడు వసించు దేశము సుభిక్షమై ధాన్య

వృద్ధియు క్షీరవృద్ధియు గలిగి ధర్మము నాలుగు పాదంబుల నడుచుననియు నట్టిప్పు డేదేశమున్నదో యచటఁ బాండవులున్నారనియూహింపవలయు"ననియు జెప్పెను కృపాచార్యుఁడు ప్రత్యేకము చారుల బంపుటకంటె సైన్యసమేతుఁడై సుయోధనుఁడు పాండవాన్వేషణార్థ మేఁగుట యుక్త" మని చెప్పెను. పాండవులు వెదకి వచ్చిన భటులు మత్స్యదేశము సుభిక్షముగ నున్నదని నుడివిరి. సుయోధనుఁడు భీష్మద్రోణ కృపాశ్వత్థామ కర్ణ శకుని దుశ్శాసన సుశర్మ ప్రభృతులగు యోధవరులను ననేక వేలసైనికులను వెంటఁ గొని విరాట్పురమున కేఁగి పుర దక్షిణభాగమున నున్న గోవులను బట్టుటకుఁ గొంత సైన్యముతో సుశర్మనుబంపిన నతఁడట్లొనర్చెను గోపాలకు లీవార్తను విరటున కెఱింగించిరి. విరటుఁడు సర్వసైన్యములను గొనిపోయి సుశర్మతో ఘోరయుద్ధముగాఁ బోరెను. వలలుఁడు, కంకుఁడు, దామగ్రంథి, తంత్రీపాలుఁడు, కౌరవసైన్యములను బొడిపొడిగా గొట్టిరి. విరటుండు జయమునొంది గోవులను మరలించుకొని వచ్చెను. సుయోధనుఁడు భీష్మద్రోణాది మహారథికులతో నుత్తర దిశనున్న గోవులను బట్టితోలుకొని పోవుచుండఁగా గోపలురు వచ్చి యుత్తరున కెఱింగించిరి. అతఁడు సైరంధ్రీ ప్రోత్సాహమున బృహన్నలను సారథిగా నంగీకరించి కౌరవసైన్యము పైకి బయనమయ్యెను. కొంతదూరము వచ్చి యుత్తరుఁడు గంభీరమగు కౌరవసేనా సముద్రమునుజూచి భయమంది యరదంబు

నుండి దిగి పాఱిపోవుచుండెను. బృహన్నల రథమునుండి దిగి వానినిఁ బట్టి స్యందనముపై బెట్టెను. అతఁడు "యుద్ధమొల్లనని యేడువసాఁగెను. ఆ క్రిందటి దినముతోఁ బదుమూఁడవ" యేఁడు పూర్తియగుటచేత బృహన్నల యింద్రునిఁ బ్రార్థించి స్వస్వరూపమును, దేవదత్త కిరీటములును, నిజస్యందనమును గొని యర్జునుఁ డయ్యెను. తఱువాత నుత్తరుని సారథిగాఁ జేసికొని శమీవృక్షంబు మీఁద నున్న గాండీవముఁ గైకొని కౌరవసైన్యముపై కురికెను. సుయోధనుఁడు పార్థునిఁ జూచి మరల నరణ్యవాసమునకుఁ బాండవులేగవలయు" నని సంబరపడెను. భీష్మద్రోణులు లెక్కజూచి యధిక మాసములతోఁ బదమూఁడేఁడులు నిండినవని చెప్పిరి. కర్ణుఁడు "పార్థుని నిముసములోఁ దుదముట్టించెద" నని గర్వాలాపములాడెను. అశ్వత్థామ రాధేయుని గర్వోక్తులకధిక్షేపించెను. ఇరువురును బోరుటకు సిద్ధపడిరి. భీష్మద్రోణులు వారించిరి. ఇంతలోఁ బార్థుఁడు వచ్చి గురుభీష్ములకు నమస్కారబాణములనువిడిచి ముందుగా గోవులను మరలించి గోపాలుర కప్పగించి కౌరవసైన్యములు గోవులపై కేగకుండఁ దాను తాకెను. అతిలాఘవముగఁ బోరి యర్జునుఁడు కౌరవుల నోడించి దేవదత్తమును పూరించెను. కౌరవవీరులందఱును సమ్మోహనాస్త్రబద్ధులైరి. వారి తలపాగల చెఱఁగులను గోసి యుత్తరకు బొమ్మ పొత్తికలకై తెచ్చెను. ఇంతలో విరటుఁడును దత్కుటుంబము వారును, కం

కుఁడు, వలలుఁడు, బృహన్నల, దామగ్రంథి, తంత్రీపాలుఁడు మాలిని, ధర్మజ భీమార్జున నకుల సహదేవ ద్రౌపదులుగా నెఱింగి వారలను మిక్కిలి గౌరవించి బలరామకృష్ణద్రుపదాది సమస్త బంధువులను రావించి యొక శుభముహూర్తమున నుత్తరను సౌభద్రునికిచ్చి పెండిలిసేసి ద్రౌపదికిఁ గీచకునివలన గలిగిన భంగపాటునకుఁ గడు చింతించి వారల నోదార్చి సుఖంబుండెను.

ఇది విరాట్పర్వము.

అ వి ఘ్న మ స్తు.

# భారతసారము.

## ఉద్యోగపర్వము.

### కార్యాలోచనము.

మహావిభవముతో నాలుగు దినములు వివాహమహోత్సవము జరిగినది. అయిదవ దినమునఁ బెండ్లిపెద్ద లందఱును విరటునికొల్వునఁ గూర్చుండియుండఁగా శ్రీకృష్ణుఁడు సభాసదులతో నిట్లనియెను. "యుధిష్ఠిరుఁడు శాబలునిచేఁ గపటద్యూతమున గీడ్పడి ఘోరంబగు వనవాసాజ్ఞాతవాస దీక్షల నిర్విఘ్నముగ నిర్వర్తించెను. పాండవులిప్పుడు గుహాముఖంబునుండి వెల్వడిన సింగంబులవోలె విజృంభించి నిజరాజ్యగ్రహణముగావించుటకు సిద్ధముగ నున్నారు. కౌరవుల తలంపెట్టిదియో మనకుఁ దెలియదు. తగువారి నంపి "పాండునృపాలు పాలు పాండవుల కి"మ్మని సుయోధను నడుగుట యుచితంబని తలంచెదను. మీ మీ యభిప్రాయంబులం దెల్పుఁడని చెప్పెను. బలరాముఁడు కృష్ణుని తలంపు లెస్స. ఇట్లగునేని ప్రజా

క్షయంబుగాక దేశక్షేమ మగును. ఆలసింపక యొక్కరుని బంపవలయును.

ఆ. వె. మాట పొందెఱింగి మోటమై నల్లన
చేరి కౌరవేంద్రు చిత్తవృత్తి
కనుగుణంబుగాఁగ నానతుం డగుచు బ్రా
ర్థించి యడుగకున్నఁ దెలుఁగుపడదు.

అది యెట్లనిన "ధర్మనందనుం డతని యుద్ధతికి సంకోచించి జూదమున మోసపోయి చిక్కు వడియెను. శకునితో జూదమాడి యోడుట వలన నేతప్పును లేదు. కావున "నీ పినతండ్రులు వారి కిచ్చుట మే" లని మెల్లఁగా నడఁగు యత్నము జరుపుట యుక్త" మని బలరాముఁ డనెను. సాత్యకి కోపించి చాలు. చాలు. నీకుఁ దక్కరుల కీ చక్కటులు రుచింపవు. పాండవులేమి తప్పు చేసిరని సుయోధనుని వేఁడికొందురు? బలవంతమున దండ్రి పిలుపున రాఁపించి కపట ద్యూతమున నోటుపఱచిన దుష్టులను దండించి రాజ్యము గొనుటయె కడు ధర్మము. ఏనును, మీరును, జిన్నన్నయు, ద్రుపదవిరాటులును బాండవులకు బాసటయై కురుబలమును సముద్రమున గలిపి రాజ్యమిప్పించుట తగిన పని. ధర్మాను సారమునఁ గబురంప దలంతు రేని.

ఉ. దైన్యముఁదక్కి దూతయుచితంబుగఁ బాండునృపాలుపాలురా
జన్యవరుండు ధర్మజుఁడు తమ్మతి వేఁడెడు నన్న లోక సా

మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చుకొందమ
న్యోన్యవిరుద్ధభాషణములాడినఁ దత్ఫలమాతఁడందెడున్.

అని బలరామునితో ననెను. సభ్యులందరును "బాగుబా" గనిరి. కృష్ణుండు నట్లొనరింపుమని చెప్పి స్వజనంబులతో ద్వారక కేఁగెను. ద్రుపదుఁడు తన పురోహితుని ధృతరాష్ట్రు సభకు రాయబారినిగా నంపెను. అర్జున నకుల సహదేవులు యుద్ధ సహాయార్థము రాజవర్యుల నాహ్వానింపఁబోయిరి. పాండవుల యత్నములు చారులవలన విని సుయోధనుండును దత్ప్రత్ప్ర యత్నములఁ జేయుచుండెను.

## కృష్ణు నాహ్వానించుట.

సుయోధనుఁడు మున్మున్న పోయి నిదురించుచున్న కృష్ణుని తలవైపున నొక యున్నతాసనమునఁ గూర్చుండెను. పార్థుఁడు వినయముతోఁ బాదములకడ నిలువఁబడెను. కృష్ణుఁడు కన్నులు విప్పి ముందుగా నర్జునునిఁ బలుకరించి వెనుకకుఁ దిరిగి "ఓ-హో బావగారా? ఏమి పనిమీఁద దయచేసితి" రని సుయోధనునిఁ బలుకరించెను. "యుద్ధసహాయార్థము నిన్ను బిలువవచ్చితి" మని పార్థ సుయోధనులు సెప్పిరి. కృష్ణుండు "మీరిరువురును నా కొక్కరూప. మీరు ముందుగా వచ్చితిరి. నేను పార్థుని ముందుగాఁ జూచితిని. ఇరువురకును సహాయము సేయుట కర్జము. పదివేవురు సంశప్తకు లొక్క పట్టు. నేనొక్కఁడనొక్క పట్టు. వారలు యుద్ధము సేయుదురు.

నే నాయుధమును బూనను, పార్థుఁడు చిన్నవాఁడు గావున ముందతఁడు గోరఁదగు" నని చెప్పెను. అర్జునుఁడు శ్రీకృష్ణునే కోరెను. సుయోధనుండు మనంబున సంతోషించి పదివేవుర నంగీకరించిపోయెను. బలరాముఁ డేపక్షమునను రాఁజాలనని చెప్పెను. కృతవర్మ యొకయక్షౌహిణీ బలముతో సుయోధనునకు సహాయమొనర్తునని యెను. సాత్యకి ప్రభృతులు పాండవపక్షముండిరి.

## సుయోధనుఁడు శల్యసహాయముఁ గోరుట.

శల్యుఁడు సైన్యసమేతుఁడై పాండవులను జూడఁబోవుచుండఁగా మార్గమునఁ జలువపందిళులు నుపాహారములు విశ్రమస్థానములు మొదలగు ననేక సఖ్యోపాయములను సుయోధనుండు గావించి తాను బరివారజనములలో నొకఁడుగాఁ బ్రవర్తించుచుండెను. శల్యుఁడు సంతోషించి "యీమహోపచారములు చేసిన ధర్మజప్రత్యర్థి నా యనుగ్రహమునకుఁ బాత్రుఁ" డని నుడివెను. సుయోధనుఁడు వెంటనే యతని యెదురఁబడి యీ ప్రయత్నములకుఁ దన కర్తృత్వమును దెలిపి యుద్ధమునఁ దనకు సహాయము సేయు" మని వేఁడెను. శల్యుఁ డందుల కియ్యకొని పాండవులఁ జూడఁబోయి సుయోధను కృత్రిమ ప్రయత్నమును దన వాగ్దత్తమును దెలిపెను. ధర్మజుఁడు "కర్ణసారథి వగు నప్పుడు వానిని నువ్వఁబలికి యర్జునునిఁ గాపాడుటకు వరం బి" మ్మని

శల్యునిఁ గోరెను, అతఁడందులకొప్పుకొని సుయోధను పక్షమునఁ జేరెను.

## యుద్ధ ప్రయత్నములు.

ధృతరాష్ట్రుఁడు పంపున సంజయుఁడు వచ్చి కౌరవుల దుర్నయంబును దెలిపెను. పాండవులు వినయముతో తండ్రికిఁ 'దమపాలి' మ్మని కబురంపిరి. సుయోధనుఁడు స్వబలోన్నత్యమును దండ్రికి దెలిపి యుద్ధమునందే కృతనిశ్చయుండయ్యెను. పాండవులు కృష్ణునిచే సందేశమంపిరి. దుష్టచతుష్టయముకృష్ణుని బంధింపనెంచిరి. కృష్ణుఁడు విశ్వరూపమునుజూపి కాఁగల తెలియం గెరింగించి పాండవుల కడకు వచ్చి సవిస్తరముగా నచట జరిగిన వృత్తాంతము దెల్పెను. పాండవుల కేడక్షౌహిణులును, కౌరవులకుఁ బదునొకం డక్షౌహిణులును సైన్యము సమకూడెను. పాండవ సైన్యమునకు ధృష్టద్యుమ్నుఁడును, కౌరవసైన్యమునకు భీష్ముఁడు సేనాపతులైరి. భీష్ముఁడంబోపాఖ్యానమును, శిఖండి జన్మవృత్తాంతమును దెలిపి "తాను శిఖండిని" నర్జునునిఁ దప్పఁ దక్కిన పాండవ బలముతో యుద్ధముసేయుదు" నని చెప్పెను. "కర్ణుఁడు యుద్ధములో నుండఁగాఁ దాను యుద్ధము సేయ నని కూడఁ జెప్పెను. కర్ణుండును, భీష్ముఁడు పడువఱకు బాణము సేతఁబట్టనని శపథము గావించెను. ఇట్టిరు సైన్యములును గురుక్షేత్రమున యుద్ధమునకుఁ దారసిల్లినవి.

ఇది యుద్యోగపర్వము.

అవిఘ్నమస్తు

# భారతసారము.

## భీష్మపర్వము.

### వ్యాసుఁడు ధృతరాష్ట్రుని కడకు వచ్చుట.

కౌరవులయొక్క దుర్వ్యసనంబునకుఁ జింతించుచు సంజయునితోఁ గూర్చుండి యుండఁగా మహానుభావుఁడగు పారాశర్యమునీంద్రుండు వచ్చి యాంబికేయునిచే నర్చితుఁడై యిట్లనియెను.

క. "కాలంబగుటయు నృపులకు
నాలము సమకూరె దీని కడలకు మది నీ
వాలోకింపఁగ వలసిన
నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్రా."

అనిచెప్పెను. "అన్నలు దమ్ములుఁ బోరాడుకొనియొకరి నొకరు వధించుకొనుచుండఁగా నేను జూడఁ జాలను. కాని వినవలయునని యున్నది. తండ్రీ! యనుగ్రహించి యట్లు

సేయవలయు"నని యాంబికేయుఁడు సాత్యవతేయుని వేఁడెను. ఆముని కరుణించి ధృతరాష్ట్రునకు మహారణంబు తెలియంగజెప్పించుటకు సంజయుని నియోగించి యతని కారెండు బలగములవారి దివారాత్రప్రవర్తనంబును, రహస్య సంభాషణంబులును, మనోవృత్తంబులును దెలియునట్లుగా వరంబిచ్చి శీఘ్రగమనంబును, సమరావని దిరుగునపుడు శస్త్రాస్త్రంబులు తగుల కుండునట్లు వరంబును, దివిజుల యాలాపంబులును రూపంబులును, దలంపులును, దేటపడునట్లును బ్రసాదించి యాంబికేయునితోఁ "కుమారా! ఇదిభూప్రజాక్షయంబునకుఁ బ్రవర్తిల్లిన రణంబు" నీకొడుకులు దుర్నీతులు. వారిపక్షమున నాయుధములు మండుచున్నవి. జయంబు సంశయంబు. పాండవులు ధర్మవర్తనులు, వారికి దైవసహాయము మెండు, "ధర్మో జయతి" యనుట నెఱుంగుదువు. నీకొడుకులను వారించి నీతమ్ము నిపాలు వారల కొసంగుము. కొడుకులు సచ్చిన వెనుక నంధుండవగు నీకీ రాజ్యమేల?" యని కృష్ణద్వైపాయనుఁడు వచించెను. అంబికేయుఁడు విని,

చ. "హితమును ధర్మముం దలఁచి
యిమ్మెయిఁ జెప్పితి రిట్లు మున్న నా
సుతుల నయంబు మీఁ దటిమి
చూచితి వారలఁ బంపు సేయ నేఁ
జతురుఁడ గాను ప్రాభవము
సాలదు నా దెస దప్పు లేమి మీ

మతిఁ దలపోసి యీపలుకు
మానుఁడు పాకముదప్పెఁ గార్యముల్"

అని నుడివినఁ గృష్ణద్వైపాయనుండు విధి కర్తవ్యంబు కానెఱింగిన వాఁడగుటంజేసి మరలఁ బ్రశ్నింపక యగోచరుం డయ్యెను. తదనంతరంబున ధృతరాష్ట్రుఁడు గొంతసేపు చింతించి సంజయున కిట్లనియెను.

సంజయుఁ డాంబికేయునకు భూవివరముఁ దెల్పుట.

ఉ. "భూమికిఁగాఁగఁ బ్రాణముల పోకఁదలంపక రౌద్రఘోర సం
గ్రామము సేయుచుండుదురు రాజులు దొల్లియు నెంతదీపికో
భూమి మునీంద్రసంగతి సుబద్ధము నీ జగంబు నాకు నీ
భూమి తెఱంగు సెప్పుము ప్రబోధనిరూఢముగా సమస్తముగ్."

అన సంజయుం డిట్లనియె. "రాజా! పంచభూతము లందును భూమి ప్రధానమైనది. "సర్వేజనాః కాంచనమాశ్రయన్తే" యను నార్యోక్తివిందువుకదా? ఈభూమి కాంచనమున కాశ్రయము. అందుచే రాజులు భూప్రియులై యుందురు. దానంజేసి సంగరంబులు ప్రవర్తిల్లుచుండును మఱియు మేరువు దక్షిణమున మిక్కిలి యున్నతమగు నొక జంబూతరువున్నది. దానికి ఫలములు నిరంతరము రాలి చిటికి తద్రసములు నదియై మేరుప్రదక్షిణముచేసి యుత్తర కురుభూములం బ్రవహించి సముద్రమునఁబడును. ఆనదికి జంబూనది యనిపేరు. ఆ నదీరసంబులు సోఁకిన చోట్లు లెల్ల సువర్ణమయము లగును.

కావుననే సువర్ణమునకు "జాంబూనద" మను పేరువచ్చినది. ఆజలపానంబున మానవులకు "ముదిమియుఁ దెవులును దప్పి యు లే" దని చెప్పుదురు. ఈ జంబూతరు కారణమున నీభూమికి జంబూద్వీపమనియుఁ బేరుకలిగినది.

క. తొమ్మిది ఖండములై వ
ర్షమ్ములనం జాల నొప్పెసఁగు జంబూద్వీ
పమ్మున జనపదములు విను
మమ్మహితాంశములు దెలియ ననువర్ణింతున్.

ఉత్తరసముద్రము శృంగవంతము. మధ్యదేశ మైరావతవర్షమనియు. శ్వేతపర్వత శృంగవంతముల నడిమి దేశము హిరణ్మయవర్షం బనియు, నీలశైలోత్తర దేశము రమణకవర్షమనియుఁ, దద్దక్షిణదేశము లీలావృతవర్షమనియు, మేరువునకు తూర్పువైపు భద్రాశ్వవర్షం బనియుఁ, దత్పశ్చిమభాగము కేతుమాలవర్షమనియు హేమకూటోత్తర దేశము హరివర్షంబనియు, హిమవన్నగోత్తర పార్శ్వదేశము కింపురుషవర్షమనియు, దద్దక్షిణ పార్శ్వదేశము భారతవర్షమనియుఁ బిలువఁబడుచున్నవి. అందు

క. భారతవర్షముఁ దొడఁగి మ
హీరమణ! యుదీచ్యము లని యెక్కుడు బల స
త్వారోగ్యాయుస్సుఖ పు
ణ్యారంభగుణంబు లంత కంతకు నరయన్.

మఱియు, మణులనీనేడు నేడుకులపర్వతంబులును, బంచలోహంబుల నిచ్చెడు ననేక నగంబులును, ధాన్యసమృద్ధి నొసంగెడు మహానదులును. సరిత్తులును, బుణ్యవనమ్ములు నీభరతఖండమున వెలయుచున్నవి. అందుచేత నుక్కివులగురాజు లీ ధనధాన్యంబుల యాధిపత్యమునకై పెనంగి దైవసహాయులగు వారలు జయమును గాంచుచుందురు: కౌరవ పాండవ యుద్ధము నందునకై ప్రవర్తిల్లినదే" యని చెప్పెను.

## భీష్మ యుద్ధము.

ఉభయబలంబులును యుద్ధమునకుఁ దారసిల్లి యెట్లొనరించి" రని యాంబికేయుఁడు సంజయు నడిగిన నతఁడిట్లనియె. "రాజోత్తమా! ధృష్టద్యుమ్నుని సేనాధిపత్యము క్రింద నేడక్షౌహిణులును, గాంగేయుని సేనాధిపత్యముక్రింద గురు సైనికులు పదునొకం డక్షౌహిణులును, యుద్ధరంగమునం దేక కాలమున నిలువఁ బడినపుడు మహార్ణవసంఘమంబై నట్లొప్పెను. భీష్ముఁడు తన సైన్యములతో,

క. ఆరయ వివృతస్వర్గ
ద్వారము రాజులకు నాహవం బందు మహా
దారులు దొల్లియు నరిగిరి
మీరీ మార్గమున నడువ మెయికొను టొప్పున్.

క. ఇంటన్ దెవులునఁ జచ్చుట
కంటెం బాపంబు లొండు గలవె నృపులకుఁ

బంటకలను పొలిగల నిది
కంట విధానంబుఁ గంట కాదే మనకుఁ.

అని పురికొల్పెను. తఱువాత ధర్మజుఁడు పాదచారియై వచ్చి భీష్మ ద్రోణకృపులకు మ్రొక్కి యాశీర్వచనరూపముగ నాయాధీరులు వచ్చు తెఱంగెఱింగించి నిజబలంబులం బురికొల్పి కయ్యమునకుఁ గడంగెను. భీష్ముఁడు విజృంభించి పది దినము లద్వితీయ పరాక్రమముతోఁ బెనంగి పాండవసైన్యంబున సగంబు నంతకాలమునందు వసింపఁజేసెను. పాండవులును గౌరవబలం బులను జాలమట్టుకుఁజిదిమిరి. తొమ్మిదవ నాఁటిరాత్రి కృష్ణ సహాయులై పాండవులు నిజఁబలాంతకుఁడగు శాంతనవునికడ కరిగి యతని దయకు బాత్రులై "తాతా! నీ దారుణ సంగర మున కోర్వఁజాల కున్నారము. నిన్ను జయింపఁ గలుగు ధీరుఁడు మాబలంబున లేఁడు. తద్విధ మెఱింగించి మమ్ములను గృతార్థులను జేయు" మని వేఁడిరి. అమ్మహానీయుఁడు కరుణించి యంగనాపూర్వుఁడగు శిఖండిపై నేను బాణంబు లేయను వానిని ముందిడుకొని పార్థుఁడు నామేను సిల్లులువడునట్లు కొట్టి నన్నుం బడలయును. నాచేత విల్లున్నంతవఱకు దేవాసుర మనుజులలో నన్ను గెలుచు వారుండరని చెప్పి పంపెను. పదియవనాఁడు పార్థుఁడట్టులొనర్చి సత్యవ్రతుండును ద్విజగద్విక్రముండును గరు ణాసముద్రుండునునగు భీష్ముని మేన సందు లేకుండఁ గ్రూర నారాచంబులఁ గ్రుచ్చి రథమును విఱుఁగఁగొట్టి చాపమును భం

జించి పడవేసెను. అతఁడు స్వాయత్తమరణుండగుటచేత నుత్తరాయణము వచ్చువఱకు బాణములను మేననిల్పి యంపశయ్యపై కొరిగెను. అర్జునుఁడు బాణప్రయోగముచేసి పాతాళ గంగను రప్పించి యతని దాహము తీర్చెను. మహావీరుఁడు గూలినందున కురుభూపాలంబులును గుంభసంభవుఁడును దుఃఖించిరి.

ఇది భీష్మపర్వము.



అవిఘ్నమస్తు.

# భారతసారము.

## ద్రోణపర్వము.

### ద్రోణుని సేనాధిపత్యము.

పతివాసిన సతివదువున భీష్ముఁడు లేచి కురుబలము దుఃఖించుచు సేనాధిపతిత్వమునకుఁ గర్ణుఁ దలంచిరి. ఆతఁడు వచ్చి భీష్ముఁడు పడుటకు గరము చింతించి పాదచారియై యమ్మహాత్ము సన్నిధిఁ జేరి,

క. “ వచ్చితి రాధేయుండఁ గను
విచ్చి నను౦ జూడు భరత వీరాగ్రణీ! నీ
సచ్చరిత్రకథలమే యి
ట్లిచ్చుట నీయునికి ధాత నేమన నేర్తుఁ.

ఆ. వె. పావనంబులైన పలుకులు నా చెవు
లార నెమ్మి నన్ను నాదరింపు
మయ్య ధర్మనిత్య, యంచితసత్త్వ శం
తను కుమార గాఢ ధైర్య సార !

సారబలుండవును, పాండవ సేనారణ్యదావానలుండవు నగు నీవు లేకునికిఁ బాండవులు సెలరేగి మృగంబులం దఱుము శింగంబుల పగిది కురుసైన్యంబులఁ దార్కొనెదరు, నీ పంపున నేఁ బోయి వారల నోర్చెదను. సెలవిడి పంపు' మన నవ్వీరుండు గనువిచ్చి చూచెను. రాధేయుండాపగా సుతునకు నమస్కరింప నతనిని సగౌరవంబుగ నాశీర్వదించి 'కౌరవులకు శ్రేయంబు గూర్పు' మని నియోగించెను. రాధేయుండు శిరంబు పాదంబులకుసోఁక వినతుండై రథారోహణము సేసెను. సుయోధనుఁడు కర్ణానుమతంబున ద్రోణుని సేనాధిపతిని" జేసెను. "ధర్మజునిఁ బట్టియిచ్చెద" నని గురుండు సుయోధనునకు వాగ్దానంగెను. ఆ పలుకులకు దిగులొందిన ధర్మజునితోఁ బార్థుఁ డిట్లనెను.

"క. క్షోణీవల్లభ విను మేఁ
ప్రాణముతో నుండ నిన్నుఁ బట్టికొనఁగ నా
ద్రోణునకే కాదు సగణ
స్థాణున కైనను వశంబె తలఁ పేమిటికిన్.

చ. అలవి యెఱుంగ కిమ్మయి దు
రాశఁ దలంచిరి గాక ధార్తరా
ష్ట్రులు ద్విజగంబులున్ గాని ప
టుస్ఫురణం జనుదెంచి రేనియున్

బలవదరాతి పుంజ మద
　　భంజన నీ వని భంగపడ్డ నీ
యిల శకలంబులై చనదె
　　యింకదె వారధి నింగి కూలదే?"

అనిధైర్యంబులు వలికి, శత్రులతోఁ బెనంగెను. రెండు దినంబులు కురుపాంచాల బలంబులు ఘోరమ్ముగాఁ బోరిరి.

## అభిమన్యు వధ.

మూఁడవనాఁడు పార్థుఁడు సంశప్తకులం దాఁకెను. ద్రోణుండు తమ్మిమొగ్గరము వన్ని యర్జునుఁడు కార్యాంతర వర్తియై యచట లేకునికి సేనా ముఖంబు నజయ్యుఁడై త్రోఁచెను. ఆ మొగ్గరమును భేధించుటకుఁ బాంచాల వీరులలో నొక్కఁడును జాల కుండెను. ఆ వ్యూహమ్ముఁ జించుట మాత్ర మభిమన్యుఁ డెఱుఁగును. తిరిగి వచ్చుట యెఱుంగఁడు. 'నీవు మొనసించిన మే మందరము గూడఁ బిఱుంద ప్రవేశించి శత్రువులను గలగుండు పఱపెద" మని పాండవులును వారి సైనికులును బ్రోత్సాహపరచి యభిమన్యు నంపిరి. ఆ పార్థకిశోరము మహాపౌరుషమ్మున నదరిపడి,

చ. ఇదె యొక పిన్న వాఁ డడరి
　　యెకుడు మూఁకల క్రందుబోలెడుం
గదుపుల వెల్పుగోపకుని
　　కైవడి నంచు జనుల్ నుతింపఁ జే

సెద విని మామ ప్రీతి విల
సిల్లఁగఁ దండ్రియు సంతసిల్లఁ బె
ట్టిదుఁ డగు కౌరవేంద్రునకు
దెప్పరమయ్యెడు భంగిఁ జేర్చెదన్.

అని బిట్టార్చి ద్రోణునిఁగలంచి వ్యూహము భేదించి కురుసైన్యంబునం దెదురు లేక పరాక్రమించి యోధుల మునుము వెట్టి నఱుకఁ జొచ్చెను. ఆ కుమారుని మహాపరాక్రమమునుఁ జూచువారు పొగడుచుండిరి.

క. సురలును సిద్ధులు విద్యా
ధరలుఁబొగడు నులివుఁ జూచు ధరణీశుల బం
ధుల నుతినాదంబులు సం
బర ధరణీ మధ్య భాగ భరితము లయ్యెన్.

అభిమన్యుని యెదుట నొకఁడును నిలిచిపోరువాఁడు లేకునికిఁ గౌరవయోధు లందఱును మొత్తమై యాకుమారునిఁదాకిరి. ఈశ్వరవరప్రసాదియై సైంధవుఁడు పాండవులను మొగ్గరంబుసొరకుండనాపెను. సౌభద్రుఁడు పెక్కురభంజించి గతాసుఁ డయ్యెను. సంశప్తకులఁ గూల్చి మరలి వచ్చిన పార్థుఁడు కొమరుని మరణంబునకు దుఃఖించి అన్నతో నిట్టు లనియె. "నిన్నును నన్నును గృపసై నిశరణంబు వేఁడినను రణభూమి.తొలంగినను దప్ప బాలహంతకుండగు నా సైంధవునిఁ బరిమార్చెద. లేకున్న మాతాపితృగతులకుఁ దప్పినవాఁడ నయ్యెదను. మఱియు,

చ. అనిమిష దైత్య కింపురుషు
లాదిగ నెవ్వరు వచ్చి కాచినం
దునుముదు నెల్లి సైంధవుని
ద్రోయజమిత్రుఁడు గుంగకుండు ము
న్న నరవరేణ్య యిత్తెఱఁగు
నాకొనరింపఁగ రాకయున్న నే
ననలము సొచ్చువాఁడ
నృపులందఱుఁ జూఁడగ గాండివమ్ముతోన్"

అని ఘోరప్రతిజ్ఞను గావించెను.

## సైంధవ వధ.

సైంధవుఁడుజడిసిసుయోధనునితోఁ జెప్పుకొనియేడ్చెను. సుయోధనుండు గురునితోఁ జెప్పుకొనెను. అతఁడు "సైంధవునిగాతు"నని చెప్పెను. ఆరాత్రి పుత్రశోకంబున నేలపైఁబరుండిన పార్థునకుఁ గలలోఁ గృష్ణుఁడు వచ్చి తనతోఁ బార్థునిఁగైలాసంబునకుంగొనిపోయి శంకరుని ధ్యానించి పాశుపత మిప్పించినట్లు తోఁచెను. మఱునాఁడు గురుండు శకటవ్యూహంబుపన్ని దాని మధ్య పద్మవ్యూహంబును దానిమధ్య సూచీ వ్యూహంబును బన్ని దాని వెనుక సైంధవుని భద్రంబు గావించెను. కృష్ణార్జునులు యథావిధి రథంబు నధిరోహించి కురుసైన్యంబుల మీఁది కరిగి సేనాముఖంబున భీషణమూర్తియై వెలుంగుచున్న ద్రోణుని గెలుచుట దుస్తరంబని తలంచి యతనికిఁ

ప్రదక్షిణంబుగాఁ దేరు నడిపి యనుగ్రహంబువడసి వ్యూహంబులోనికిఁ జొరఁబడి తక్కు యోధులను జెందరవందరగాఁగొట్టి సైంధవుని దెస కేఁగుచుండఁగాఁ బోటుమానిసు లందఱు వెఱఁగువడి కుంభసంభవునిఁ జీరిరి. ఆయనవచ్చి యెదిరించిన నలువురు నొక్కుమ్మొగి నర్జునునిపైఁ దలఁపడిరి. ప్రొద్దుగ్రుంకు సమయము కావచ్చెను. అర్జునుఁడు మిథ్యాప్రతిజ్ఞుఁడై "చచ్చెఁ జచ్చె" నని కురుబలంబున నాహారవంబులు వెడలెను. కృష్ణుఁడు మాయాతిమిరంబుచే సూర్యునిఁ గప్పెను. సైంధవుఁడు "ప్రొద్దు గ్రుంకె" నని యెంచి పశ్చిమదిశఁ జూచుచుఁ దల వెడలఁ బెట్టెను. కృష్ణ ప్రోత్సాహమున నర్జునుఁడు సైంధవుని తలఁ దునిమి యాకసంబున నాడించుచుండెను. "సైంధవుని శిరంబును నేలకుఁద్రోచిన వానితల సహస్రశకలంబులగు" నట్లు సైంధవ జనకుండు శాపమిచ్చుటం జేసి పాశుపతాస్త్ర ప్రయోగంబున వానితల సూర్యున కర్ఘ్యంబిడుచున్న సింధుపతి తండ్రి దోసిటఁ బడఁజేసెను. ఆతండా శిరంబు క్రిందికద్రోసి భిన్న శిరస్కుండయ్యెను. మరలఁ దిమిరంబు వాసి పశ్చిమ దిశను సూర్యుఁడు దోఁచెను.

## ద్రోణుని మరణము.

అయిదవ దినంబున ద్రోణుండు కృష్ణార్జునులచే మోసపోవుటకుఁ గుపితుఁడై పాంచాల బలంబులఁ జెండాడుచుండెను. గురుని బారి భరింపలేక పాండవులు "నాఁడే సుయోధనునకు

జయంబుగలుగు" ననునంతటి భయము నందిరి. ద్రోణుఁడు నారాయణాస్త్రమును బ్రయోగించెను. పాండవులు నమస్కరించి తప్పుకొనిరి. కృష్ణుఁడు కార్యము నాలోచించు చుండెను. గురునకు మిక్కిలి దూరమున నశ్వత్థామయుద్ధము సేయుచుండుటఁ గనిపెట్టి కృష్ణుఁడు ధర్మజుని చేత బలవంతమున "నశ్వత్థామ మృతినొందె"నని బిగ్గరగాను గుంజరమని మెల్లగా ననిపించెను. ఆవిపరీతవాక్యము సత్యమూర్తియగు ధర్మజుని నోటి నుండి వెలువడుట విని కుంభసంభవుఁ డస్త్రసన్న్యాసము సేసి ప్రాయోపవిష్టుఁడయ్యెను. ధృష్టద్యుమ్నుఁడు పరుగిడివచ్చి గురుని శిరంబును గత్తితోఁ గోసెను. గురున కక్రమాచారము గావించిన ధృష్టద్యుమ్నునిపయి నర్జునుఁడు కోపించివాని నాల్కఁ గోయబోయెను. కృష్ణుఁడు పార్థ! చాలుఁ జాలును. ద్రోణవధార్థము జనించుటంజేసి విధినియోగంబున నతఁడట్లొనరించెను. నీవు కినియనక్కఱలే"దని పార్థుని వారించెను. అశ్వత్థామ తండ్రిమరణమునకు దుఃఖించి ఆకోపమున "నపాండవము సేసెద" నని శపథంబు గావించెను.

ఇదిద్రోణపర్వము.

———: (o) :———

# భారతసారము

## కర్ణపర్వము.

### కర్ణుని సేనాధిపత్యము.

కుంభసంభవుఁడు గూలిన పిమ్మట సుయోధను బలంబులు నిస్తేజములయ్యెను. పాంచాలబలంబు లతిధైర్యమునందెను. ఎవరి సహాయమునఁ గౌరవులకు జయము కలుగవచ్చునని ప్రపంచమంతయు నెంచెనో యట్టిభీష్మద్రోణులు కడతేరిరి. ఈవార్త విని ధృతరాష్ట్రుఁడు బెగ్గిలిపోగెను. మఱియు సంజయునితో నిట్లుమనియె.

క. పురందర శిఖండి నిడి సం
క్రందన నందనుఁడు సేరి గంగాతనయుఁ
బ్రమందించి కపటమున నా
చందమొకటి కర్ణునందుఁ జర్పించి రొకో !

క. సామజము పడిన నశ్వ
త్థామ పడియె నపుడె ధర్మతనయుఁడు గురునిఁ
దా మడియుంచుటకై యా
జ్ఞేమేని యొనర్చి రొకో యితఁడు పడుటకున్.

అని ధృతరాష్ట్రుఁడు తనసైన్యములను మాయోపాయములచేత వధించుచున్నట్లు తలఁచి దైవోపహతులగు నిజ

యోధుల మరణమునకు దుఃఖించెను. అట సుయోధనుండు కర్ణునిఁగాంచి,

శా. నీ విక్రాంతియు నా పయింగల
యతిస్నేహంబు ప్రఖ్యాతముల్
గావే భీష్మునిపై ద్రోణుడున్ దెగుట
నీ కౌరవ్యసైన్యంబు
గావంగాఁ దగు నీకు వారల
యుపేక్షంగాక యిన్నాళ్ళు తె
లా వైరం బడఁగింప నీవయిన
లీలం గెల్తు కౌంతేయులన్.

అని శ్లాఘించి యశ్వత్థామాదికులఁ జూచి "కర్తవ్యం బే" మని యడిగెను. అతఁడు "కర్ణుని సేనాధిపతినిఁ గావించి జయ కాంక్షం గోరు" మని ప్రత్యుత్తరమిచ్చిన నట్లే కర్ణునకు సర్వ సేనాధిపత్య మొసంగెను.

మ. " విను నీకిచ్చిన బాస యే మఱుతునే
వీరంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్రవీర్యమును నీ
భూలోకసంచారు లె
ల్లను గీర్తింపఁగ బాండుపుత్రుల
మదోల్లాసంబు మర్దింతు నీ
వనుమానింపక నిల్చి చూడుము
మదీయంబైన సంగ్రామముల్. "

అని చెప్పి సేనల సమకూర్చుకొని పాంచాల బలంబులం దల పడియెను. పాండవులు సంరంభముతోఁ గురుబలంబులఁ జెండాడ సాఁగిరి. భీముఁడు మత్తమాతంగమువోలె నెదురు లేక కురుసైన్యంబునఁ దిరుగాడుచుండెను.

## దుశ్శాసన వధ.

సముద్రమథన కాలంబునఁ గవ్వమై తిరిగిన యచలంబు వోలె దిరుగుచున్న భీమసేనుని జూచి దుశ్శాసనుండు తగిలెను. వానిం గని

ఉ. "ఆసభలోనఁ గొన్నఋణ మంతయు
నీగఁగఁగంటి వడ్డితో
శాసకోకింతయుం దొలఁగఁ
బాఱకు తీర్చెద నిప్పు నేను నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు
నిన్నిటు సేరఁ దెచ్చుటం
జేసి విధాత నాకు గృప సేయుట
గానఁ వచ్చెఁ దమ్ముఁడా."

అని నిశితశరంబుల దుశ్శాసనుని పైఁగురిసెను. అతండు లెక్కగొనక తిరిగి వాడితూపులచేఁ బవనాత్మజు సారథిని గూల్చి రథ్యంబులం జంపి సూతునిఁ గడ తేర్చెను. భీమసేనుండు వాయుప్రజ్వలిత వహ్నిఁబోలె మండిపడి గదామాత్ర

సహాయుండై దుశ్శాసనునిమీఁది కురికి గదతో మోది యొక్క-పెట్టున రథ్యసూత కేతనములతో వాని యరదంబును నుగ్గు సేసెను. అప్పటి భీముని భీషణాకారమును జూచి భయభ్రాంతులై కురువీరులు దూరంబుగాఁ జనిరి.

మ. నరసింహుం డసురేంద్రుఁ బట్టి
కరణిన్ రౌద్రం బుదగ్రంబుగా
నురమత్యుగ్రతఁ జీరి గ్రమ్మి రుధిర
మ్ముల్లాసియై దోయిట
న్వారవారంగొని త్రావుచుండఁ జవికిన్
మేనున్ మొగంబున్ భయం
కరరేఖం బొరయంగఁ జల్లికొను న
క్కారవ్యుఁ జూచున్ బొరిన్.

కృతప్రతిజ్ఞుఁడై గద చేతబూని గిరగిరఁ ద్రిప్పుచుఁ గురువీరులను బోరికిఁ బిలిచినను రాకునికి మరల దుశ్శాసను కడకు వచ్చి కాలితోఁ దన్ని మొగంబు నిటు నటు కాలితో గదలించి

క. "ఏమిర పసులని యార్చెదవు
నీమాటలు నిలువఁ బడియెనే పసరమ ని
మ్మేము మగుడ నిదె యార్చెద
మీమాటకు మాఱువల్కు-రెవ్వరుఁగంటే.

ఉ. నెట్లన యల్గినం దగునె? నీళ్లన
ద్రోచుటయున్ విషాన్నమున్
బెట్టుటయున్ మహాభుజగభీషణ
దంష్ట్రిలపాలు సేతయుం
జుట్టలు బెద్దలుం జెలులుఁ
జూడ సభన్ న్నెఱిమాలి యమ్మెయిన్
దిట్టున కోర్చు టెందుఁ గలదే
విను గల్వారె జూదమెవ్వరున్.

అని ధార్తరాష్ట్రుల నెవ్వనాడుచుండఁ బాంచాల సైనికులు జయధ్వానంబులు సేసిరి. కౌరవులు విషణ్ణులయిరి. ఇంతలో సూర్యుఁడ స్తంగతుఁడగుటం జేసి యుభయపక్షంబులు శిబిరంబున కేఁగిరి. భీమసేనుని దారుణంబు జూచి మఱునాఁడు కర్ణునకు శల్యుఁడు సారథి యగునట్లు నియోగించి పాండవుల నొంప నెంచిరి.

## కర్ణవధ.

మూఁడవదినమునఁ గర్ణుఁడు శల్యసారథ్యము గైకొని దుశ్శాసను మరణంబునకుఁ జింతించుచున్న రారాజుమనంబునఁ బ్రీతినెలకొల్పఁ దలంచి యర్జునునిఁ దాఁకెను. అర్జునుండును గర్ణునిచేఁ బరాజితుండైన ధర్మజునకుఁ బ్రియంబు సూప గర్ణునిఁ దెగటార్పనెంచి వానినెదిరి నిలిచెను. పార్థుని విక్రమస్ఫురణఁజూచి కురురాజునకు -ద్రోణసుతుండు "సంధిచేసికొ"

మ్మనిహితంబు సెప్పెను. రారాజు తిరస్కరించెను. కర్ణుఁడు క్రూరశరంబులచే నర్జునునిఁ గృష్ణునిఁ నొవ్వఁగొట్టెను. పార్థుఁడు గినిసి మహాస్త్రములఁ బ్రయోగింప నతఁడు మరల మహాస్త్రములచేత వారించుచుండెను. కర్ణుఁడు మహాక్రోధంబున సర్పముఖశరంబును వింట సంధింప శల్యుఁడు వారించి "తగురీతి మరల సంధింపు" మని యెల్లిదము చేసెను. కర్ణుఁడు కోపించి శల్యునిఁ దూలనాడెను. ఈ సంరంభమున నయ్యస్త్రమును పార్థ ఫాలమునకు గురిగాఁ బ్రయోగించెను. కృష్ణుఁడయ్యస్త్రము పార్థశిరమును ద్రుంచఁ గలుగు టెఱింగి యర్జునుని రథంబు భూమిలోని కైదంగుళములు క్రుంగునట్లు బొట్టనవ్రేలితో నణఁగ దొక్కటం జేసి నాగాస్త్రము పార్థుకిరీటమును నేలకుఁ ద్రోచి భగ్న మొనరించి తిరిగి యర్జునునిపైకి వచ్చుచుండఁగా కృష్ణ ప్రేరేపితుఁడై పార్థుఁడా నాగంబును బాణంబునఁ దునిమెను. అర్జునవధార్థము దాచి పూజించుకొను నాగాస్త్రము విఫలమగుటకుఁ జింతించుచు ఘోరంబుగాఁ బోరు సల్పు కర్ణుని రథము విప్రశాపమున భూమిలోనికిఁ గ్రుంగెను. రాధేయుఁడు రథచక్రము నెత్తికొనుచు పార్థునితో "ముహూర్తమాత్రము శరప్రయోగమాపుము. భూమిస్థునిపై రథస్థుఁడు శరము లేయుట శూర లక్షణము, యుద్ధధర్మమునుగా" దని చెప్పెను. కృష్ణుఁడు నవ్వి "లక్క యిల్లు గాల్చుటయుఁ, గపట ద్యూతమున రాజ్యమపహరించుటయు, నాఁడు దానిని సభలో

భంగపఱచుటయు, బాలు నభిమన్యుఁ బదుగురు గూడుకొని చంపుటయు సేయునపుడు లేనిధర్మము లిప్పుడు స్ఫురించినవి కాబోలు" నని హాస్యము సేసెను. ఆ యపచారములను స్మృతికి దెచ్చుటచేత నర్జునుఁడు రోషావేశుఁడై నిశితశరమ్మునఁ గర్ణుని కంఠము దునిమెను. కర్ణుఁడు గూలుటకు సుయోధనుండును గురుసేనలును గన్నీరు మున్నీరుగా నేడ్చిరి. అంతలోఁ బ్రొద్దుగ్రుంకెను.

ఇది కర్ణపర్వము.



# భారతసారము

## శల్యపర్వము.

### శల్యవధ.

రాధేయుఁడు పడిన తరువాత శల్యునకుఁ గురుసేనాధిపత్యముఁ గూర్చిరి. అప్పటికి యుద్ధము పదునేడు దివసములు జరిగినది. పాండవులు చేవమిగిలియుండిరి. కౌరవులు క్షీణదశ నందిరి. కృపాచార్యుండు 'సంధి చేసికొనుట యుక్త' మని యనేకభంగుల సుయోధనునకు బోధించెను. వాని పలుకును పెడచెవిఁ బెట్టి కయ్యమునకుఁ గాలుదువ్వెను. ధర్మజుఁడు శల్యుని నతని చుట్టములను సోదరుని శక్తిప్రయోగమునఁ గూల్చెను. నకులుఁడును సహదేవుఁడును గుఱ్ఱపు దళములను సహాయముగాఁ గొని కురుసైన్యమును బాఱఁదోలిరి. కర్ణకుమారులఁ గూల్చిరి. భీముఁడు మిగిలిన సుయోధనానుజులను దుశ్శాసనునిఁ గూడఁ జంపెను. అర్జునుని దేవదత్తధ్వనికి విరామమే లేదు.

## కృష్ణార్జునుల సంభాషణ.

క. ' పెనకువ యడ తెర్వ్వక పదు
నెనిమిది దివసములు సెల్లెనే బెనగంగా
వనధిం బోలెడు గురుబల
మనఘా! కనుఁగొనఁగ గోష్పదాకృతియయ్యెన్

గ్రుడ్డిరాజు కొడుకుల మూర్ఖ్యము వలనఁ బ్రవర్తిల్లిన యుద్ధమున వారికేచేడ్పాటు కలిగినది. మహావీరుఁడగు శాంతనవుండు పడినను నమోఘవిక్రముఁడగు గురుఁడు కూలినను దనకు బ్రియులగు కర్ణ దుశ్శాసన శకునులు గడతేరినను దుదకు శల్యుని మరణంబుఁ గన్నులారఁ గాంచినను వీనికి జయాభిలాష నశింపకున్నది. వీని వివేకశూన్యత నేమని చెప్పుదును.

క. క్షోణీ రాజ్యార్థము దన
ప్రాణము కలుగంగ నీఁడు రారాజు జగ
త్ప్రాణపరాయణ కరణ ధు
రీణుం డగు పాండుసుత గరిష్ఠునకెట్లున్.

అని ఫల్గుణుఁడు గంసారాతికిఁ జెప్పి యూర్పువడినఁ గృష్ణుండతనితో నిట్లనియె "పార్థా

ఉ. అక్కడ సంధికిం జనిన యప్పుడు నవ్విదురుండు "కృష్ణ నీ
విక్కడ కేలవచ్చితి విహీనవివేకుఁడు దుర్మదాంధ్యముం

దక్కునె? సంగరంబయుచితంబగుకృత్యముకాక యిమ్మెయిఁ
ముక్కునమూర్పుగల్గుజనుండు సుయోధనుఁడుర్వియిచ్చునే ?

అని నాకు బోధించెను. అదియునుంగాక యీ పాపా
త్ముఁడు పుట్టినప్పుడు వీఁడు సకల క్షత్రియనాశనుఁ డగు" నని
మునులు సెప్పిరి. అది యంతయు యథార్థమయ్యెను. ఇఁకఁ
గొలఁది సైన్యము మాత్రమున్నది. వేగ రూపుమాపుమనెను.

దుర్యోధనుఁడు ద్వైపాయనహ్రదమున డాగుట.

కిరీటియు, భీమసేనుండును, గవలును, సాత్యకి ధృష్ట
ద్యుమ్నులును సక్రోధంబుగా బయలుదేఱి మిగిలిన కురుబలం
బులను రూపుమాపిరి. కృప కృతవర్మాశ్వత్థామలు చిరజీవు
లగుటంజేసి యెచటికేనియుంబోయిరి. దుర్యోధనుం డేకాకియై
గదను మాత్రము గైకొని పొలికలను విడిచి మఱుఁగు వడి
యెను. యుద్ధ విషయంబులం గ్రహించి ధృతరాష్ట్రున కెఱిం
గించుచున్న సంజయుని సాత్యకి పట్టుకొనియెను. ధృష్టద్యు
మ్నుఁడు గాంచి నవ్వి సాత్యకితో,

తే. గీ. "వీని నేటికిఁ బట్టితి వీఁడు బ్రతికి
యిచట వర్తించి యెగ్గేమి సేయు నప్ర
యోజన మిది వీఁడు" మనిన "నేల
విడుతు నీద్రోహి తలఁ దెగ నడఁతు" ననుచు,

కత్తిచేఁబూని నఱుకఁ బోవుచుండఁగా వేదవ్యాసుండు ప్రత్యక్షమై వానిని విడిపించెను. సంజయుఁడట్లు బ్రదికి పర్విడి పోయి సుయోధనునిఁ గలిసి కొనియెను. సుయోధనుండు చింతాక్రాంతుఁడై తండ్రికిట్లు సందేశ మంపెను.

క. కౌంతేయుల భారిం బడ
నింతియ సిరి చాలు రాజ్యమెల్లను దారై
పొంత ననుఁ బెట్టుకొని యొక
కొంత యొసఁగి రేని యట్టి కూడేమిటికిన్.

క. అనుజులఁ దనుజుల మత్పరి
జనులను సమయించి వారు సమరోల్లాసం
బున మెఱయఁ జూడ నేర్తురె
జననాథున కింత వట్టు సంజయ! చెప్పుమా.

క. ఇమ్మడువులోన డాఁగెద
నిమ్ముల నెచ్చటికి నైన నేఁగెదఁ దగు వృ
త్తమునఁ దొలఁగి పిలిచి మఱి
యెమ్మెయి నేనియును దీర్తు నేఁ బగ యనుమీ.

అని చెప్పి జలస్తంభనవిద్యచే నా హ్రదంబున డాఁగి యుండెను.

భీముఁడు సుయోధనునిఁ గూల్చుట.

ఇట్లు మడువులో నున్న సుయోధనుని తెఱంగు కృప కృతవర్మాశ్వత్థామలు సంజయుని వలనవిని యతనికడ కేఁగి

యుద్ధమునకుఁ బురికొల్పిరి. డస్సియున్న సుయోధనుఁడు కద నమ్మున కొల్లక "నాఁడు విశ్రాంతిఁగొని మఱునాఁడు యుద్ధ ము నేయుద" మని వారలతోఁ జెప్పి పంపెను. వీరి సంభాషణ మును భీముని వేఁటకాఁడు వినెను. పాండవులు సుయోధనుఁ డెందునుగానక వెదకుచుండఁగా నవ్వేఁటకాఁడు సుయోధనుఁ డున్న తావును దా వినిన ప్రసంగమును బాండవులతోఁ జెప్పె ను. పాండవులును వారియోధులును గలసి యామడువు గట్టు నకు వచ్చి మడువులో నున్న సుయోధనునితో నిట్టులనిరి.

చ. "కొడుకులుఁ దమ్ములున్ గలన
ఘోరపుఁజావులు సావఁజూచి మె
ట్లాడఁబడె నీదుబుద్ధి యొడ లోముట
కై నిను రాజరాజ యి
మ్మడువున కీడ్చి తెచ్చె విధి
మానము ప్రాణము కంటె జాల నె
క్కుఁడగుట సెప్పఁగా వినవొకో
కడునీచతఁ బొందితక్కటా!

మాకంటెఁ బడితి వింకెంటిఁ బోఁగలవు? భయము విడనాడి పౌరుషముఁ దెచ్చుకొని కదనంబున జయమో పరా జయమో కాంచుము.

చ. అని మము నోర్చినం బృథివి
యంతయు నేలఁగ వచ్చు లేక చ

చ్చిన సురసద్మ సౌఖ్యములు
చేకుఱు రెండుఁ దెఱంగులందు ను
ప్పని యది లేదు డాఁగ నగుబాటును
ప్రాణముచేటుఁ దెచ్చికోల్
విను మను నీ వెదుర్పఁ దగు
వేయివిధంబులఁ జాటి చెప్పెదన్."

అని చెప్పిన మనువుల్లోనుండి సుయోధనుఁడు "ఓయీ నాబలమంతయు మునిసినది. ఏకాకి నైతిని. యుద్ధమునం దాన విడిచితిని. ధాత్రీతల మంతయు నీ కొసంగితిని. ఈ పాడునేల నెత్తినఁ గట్టుకొనుము. నే నడవులం దప మాచరించెద పొ"మ్మనెను. ఆ మాటలను విని ధర్మనందనుఁడు "నేను క్షత్రియుఁడ నగుటచే నీ దానమును బరిగ్రహింప నొల్లను. నన్ను నీ వేనియు, నిన్ను నే నేనియు జయించి రాజ్యము నేలవలయును. బయల్పడుము. నికృష్టంపు జావు కంటె రణంబునఁగూలుట యుక్తము. శస్త్రాస్త్రములు లేవని చింతింపకుము. పదుగురితో నొకకరుఁడు పోరవలసి వచ్చెఁ గదా యని సంశయింపకుము.

చ. వలసిన యస్త్రశస్త్రములు
వాహనముల్ గొను మొక్కరుండ నిన్
గలన జయించు వాఁ డతని
గర్వము నీ పడగించె దేని యీ

యిల సకలంబుఁ గైకొని

వహింపుము రాజ్య విభూతి వాఁడు నీ

దలపడి పోరుఁ జుట్టలును

దక్కటివారలు నిల్చి చూడఁగన్.

మా యెవ్వరిలో నీ యిచ్చ వచ్చినవారిని నెంచికొను" మని చెప్పెను. ఆపలుకులకుఁ గృష్ణుఁడు గటగటపడి ధర్మజున కిట్లనియె. "ఓయీ! గదా రణంబున నితఁడు మీయందఱకంటెను బెద్ద

చ. ఒకరినిఁజంపి తేని సకలోర్వియుఁ గైకొనుమంట నీవు మున్
శకునికి మాయజూదమున సంపదలెల్లఁద్రయోదశాబ్ద భో
గ్యకృతినమర్చి యొడ్డినటులై నది వందెపుఁగయ్యమయ్యెశ
త్రుకులమునెల్లదుఃఖపడి త్రుంచుటదాఁదుదిఁబందెమాడనే.

భీముఁడు గూడఁ గ్రమయుద్ధమున వీని నోర్వఁ జాలఁడు. చాల తప్పు సేసితి" వనిన భీముఁడల్గి "ఏమీ! యే నొక్కండ వీనితోఁ బోరి జయంబుఁ గాంచెద, నని బీరంబులాడెను. సుయోధనుండు మడువు వెడలి వచ్చి భీమునితోఁబోరి యతని నొంప సంసిద్ధుఁ డయ్యెను. పాండవబలంబులు "భీముఁడువడె" నని హా హా రవంబులు సేసిరి. కృష్ణుఁడు తన తొడపైఁ దట్టికొని భీమునకు సైగసేసెను. ఆ సన్న గ్రహించి భీముఁడు సుయోధనుని తొడలు విఱుగఁ గొట్టి కూల్చి,

తే. గీ. ఏకవస్త్రఁ బాంచాలి నట్లీడ్చి తేరఁ
బనిచి సభలోనఁ బలిచిన పాపఫలము
ననుభవింపుము దుష్టాత్మ! యనుచు వామ
చరణమునఁ బెట్టిదముగాఁగ శిరముదన్నె.

ఇది శల్యపర్వము.



అవిఘ్నమస్తు.

# భారతసారము

## సౌప్తిక పర్వము.

### ద్రౌణి పాంచాలసేనల వధించుట.

తొడలు విఱిగి పడియున్న రారాజుదగ్గరకుఁ గృతవర్మ కృపాశ్వత్థామలు వచ్చి వాయుసూనుని యకృత్యంబు వినిరి. వారిలో నశ్వత్థామ కుపితుఁడై పాండవబలము నిశ్శేషము గావించుటకు సుయోధనునిచే సేనాధిపత్యము నందెను. వారలటువీడి యొక వటవృక్షముక్రిందఁ గూర్చుండిరి. ఆ రాత్రిసమయంబున నొక్క గుడ్లగూబ వృక్షముకడకు వచ్చి పవలంతయుఁ దనను బాధించిన పక్షిసముదాయమును నిద్రమత్తతఁ గాంచియున్న సమయంబునఁ జెండాడెను. ఆ వివరమంతయు నశ్వత్థామ తెప్పవాల్చక చూచి శత్రునాశనమున కది మంచి యుపాయముగా గ్రహించి కృప కృతవర్మలను నిద్రలేపి "నిద్రాసమయంబున బాండవులను వారిసైన్యములను వధించెద" నని చెప్పెను. కృపాచార్యుండు నిద్రించు వారినిఁ జంపుట దోస' మని యెన్నియోవిధముల బోధించెను. ధను

రాచార్యపుత్రుని కా మాటలు రుచింపమి రథము నెక్కి పాంచాలుర శిబిరంబులకుఁ బయనమయ్యెను. కృప కృతవర్మలుగూడ వానితోఁ బోవుచుండిరి. మార్గ మధ్యమున ద్రౌణికొక మహాశక్తి యడ్డమయ్యెను. దానిని వారించుట కన్నియో యాయుధములఁ బ్రయోగించెను. ఆశక్తి వాని నన్నిటిని మ్రింగివైచెను. అశ్వత్థామ నిరుత్సాహుఁడై యరదము దిగి యీశ్వరునిఁ గూర్చి తపస్సు చేసెను. ఒక గడియ సేపటికిఁ బెద్ద మంట యొకటి కన్పడెను. ఆమంటయే "యీశ్వరుఁ"డని భావించి తన శస్త్రములతోఁ గూడ నామంటయందుఁ బ్రవేశించెను. అప్పుడీశుఁడు వానికిఁ బ్రత్యక్షమై "శక్తిస్వరూపమునఁ గన్పడినది తానే' యని చెప్పి పాండవ సైన్యంబులను వధింపఁ గలుగుట కొక కత్తి నిచ్చి తానశ్వత్థామయందుఁ బ్రవేశించెను. ఆతఁడు నిశ్శంకముగాఁ బాంచాలుర శిబిరంబులం బ్రవేశించి నిదురించువారలను నఱికెను. కొందఱు మేల్కాంచి యెదిరించిరి. వారినిఁగూడ సంహరించెను. పాండవులును సాత్యకియుఁ కృష్ణుఁడు మాత్రము వాని కెచ్చటను గన్పడలేదు. ఈవార్తను గొనయూపిరితోనున్న రారాజునకుఁ జెప్పెను. అతఁడు విని మృతుఁడయ్యెను.

### పాండవు లశ్వత్థామను వంచించుట.

ఒక దూత వలన నీ ఘోరకృత్యమంతయును బాండవులువిని మూర్ఛనందిరి. కృష్ణసాత్యకులు శీతలోపచారములు

సేయ సేద దేఱి సర్వజనక్షయమునకు దుఃఖించిరి. ద్రౌపది యు నుపపాండవుల వధకుఁ బెద్దయు దుఃఖించి "యీక్రూర కర్మమొనర్చిన ద్రోణసుతుని శిరంబును దెచ్చి తన కిమ్మ" ని భీముని వేఁడెను. భీముఁడు నకులుని సారధిగాఁ జేసికొని రథ మునెక్కి యశ్వత్థామ నారయుచుఁ బోవుచుండెను. కృష్ణుం డు "ద్రౌణి మత్సరగ్రస్తుఁడనియును, వానియొద్ద "బ్రహ్మశిరం బను" నొక మహాస్త్రమున్న దనియును, దానికిఁ బ్రపంచ మునం దెదురేదియు లేదనియు, భీముఁడా యస్త్రమునకు బ్రతిసేయఁ జాలఁడనియును బార్థునకుఁ దక్క వేఱొకరి కది దుస్సాధ్యమనియుఁ" జెప్పి ధర్మార్జున సహదేవ సాత్యకులను వెంటఁగొని యేఁగి భీమునిఁగలిసికొని యశ్వత్థామయున్న యెడ కుఁబోయెను. అశ్వత్థామ తపస్సమాధియందుఁ గూర్చుండి మహానిష్ఠతోఁ దపస్సుచేయుచుండెను. భీముఁ డతికోపమున వానిని నిష్ఠురోక్తులాడి, "గదచేశిరంబుబ్రద్దలుచేసెద"ననిమీఁదికి బోవుచుండెను. అశ్వత్థామ యీ తెఱఁగెఱింగి బ్రహ్మశిరం బును నొక గడ్డిపోఁచ యందునభిమంత్రించి "యపాండవ మగుఁగాక" యని ప్రయోగించెను. ఆ యస్త్రము నింగిముట్టు మంటలఁ గక్కుచుఁ బాండవాభిముఖముగ బయలు దేఱెను. కృష్ణుని ప్రేరేపణమున నర్జునుండా యస్త్రమునే "ద్రౌణికపా యము లేకుండ నస్త్రమును వారించి పాండవుల రక్షించుఁ గాత" మని ప్రయోగించెను. ఆ రెండు నొకటి కొకటితాఁకి

భువనంబున దగ్ధముసేయఁ బూనెను. వ్యాస నారదాది
మునులు వచ్చి 'యస్త్రముల నుపసంహరింపుఁ' డనిరి.
ద్రౌణి కా తెరవు దెలియమిఁ 'పాండవులను దక్క పాండ
వేయదారల గర్భంబులను భేదించుగాక' యని మరల్చెను.
'ఉత్తరాగర్భమునకు నేను ప్రాణముల నిచ్చితి నని వరమి
చ్చెను. అర్జునుఁడు లోకోపకారార్థము తన యస్త్రము నుప
సంహరించెను. ద్రౌణియస్త్రము ప్రయోగ కృత్యమును నిర్వ
హించెను. కృష్ణుని వరప్రభావమున నుత్తరాగర్భమునకు
మరలఁ ప్రాణంబులు వచ్చెను. ఇట్టి యకృత్య మాచరించినం
దునకు "మూడువేల వత్సరములు కుష్ఠశరీరుఁడవై తిరుగు మని
కృష్ణుడశ్వత్థామను శపించెను. భీముఁడాతని శిరోరత్నమును
గైకొనిపోయి పాంచాలి కిచ్చెను.

ఇది సౌప్తికపర్వము.

అవిఘ్నమస్తు.

# భారతసారము.

## స్త్రీపర్వము.

### అంబికేయుని పుత్రశోకము నపనయించుట.

తన నూర్వురు కొడుకులును గలనఁ గూలిన విధంబు విని ధృతరాష్ట్రుఁడు మూర్ఛవోయెను. విదురాదులు శీతలోపచారములు సేయ మూర్ఛదేఱి మితిమీఱి దుఃఖించుచుండ నమ్ముదుసలిని సంజయుండును, విదురుండును, నోదార్చుచు నిట్లనిరి.

తే. గీ. యౌవనంబును రూపంబు జీవితంబు
ద్రవ్యసంచయములు ననిత్యములుగావె
వీని హానికి వగ నవివేక మగుటఁ
బండితులు వగఁ గూరరు పౌరవేంద్ర.

క. ప్రియవస్తు వెడలుటయు న
ప్రియంబు వాటిల్లుటయుఁ బరిజ్ఞానవిని
శ్చయహీనులైన యల్పా
శయులకు దుఃఖంబుఁ జేయు జగతీనాథా!

క. తేరు శరీరము దానికి
సారథి సత్త్వంబు తురగచయ మింద్రియముల్
దారుణతరబుద్ధి వ్యా
పారములోనరంగ నినుప పగ్గము లధిపా.

క. వానిఁ దమ యిచ్చ నెందుం
బోనీకుండంగ నాఁగు పురుషుఁడు సంపా
రానేక దుఃఖభాజన
తానిరసనము గన నేర్చు ధరణీనాథా!

అనిన దుఃఖోపశాంతి నతఁడును గాంధారితోఁ గలిసి పొలిగలను జూడఁబోయెను. తఱువాతఁ గృష్ణునితోఁ గలిసి పాండవులు ధృతరాష్ట్ర గాంధారులను జూడవచ్చిరి. వారిచే నమస్కారంబులం గొని యాంబికేయుండు ధర్మరాజాదులను కౌఁగిలించుకొని యాశీర్వదించెను. భీమసేనుఁడు నమస్కరింపు చున్నాఁడని కృష్ణుండు సెప్పెను.

తే. గీ. భీము డనుమాట విని యతిభీమమైన
యలుక యాను వహించి యవ్వీరుఁ డను నవమ్ము
దరికొనంగ నుంకింప నధర్మవిధికి
నాయితం బగు న య్యాంబికేయుఁ జూచి.

క. మన సెఱిఁగి హృషీకేశుఁడు
దనమనమున నిద్దురాత్ము తలఁ పొప్ప దిసీ!

యనుచుం బవనజు నద్దెసఁ
జనకుండఁగఁ బట్టి వీతసంభ్రమలీలన్.

త్రికాలవేది యగు కృష్ణుండు దా దెచ్చిన భీముఁ బోలు నినుపబొమ్మను ధృతరాష్ట్రుని ముందటఁ ద్రోచెను. అతఁడా విగ్రహమును గాఁగలించుకొని పొడిసేసెను. అచ్చటి వారందఱును విస్మితులైరి. ధృతరాష్ట్రుఁడు దానయఃపిండమును బొడిసేయుట దెలిసికొని సిగ్గు పడెను. కృష్ణుండనేక విధమ్ముల వానిని జీవాట్లు పెట్టెను. గాంధారి పుత్రశోకాతురయై ధర్మజునకు శాపంబొసఁగఁ దలఁచుచుండ వ్యాసుండు ప్రత్యక్షమై వారించెను.

## గాంధారి దుఃఖము

క. ప్రాణంబులు విడిచియును గృ
పాణాదులు విడువకున్న భటు లారయ స
ప్రాణులఁ బోలెం బ్రథన
క్షోణికిఁ దొడవగు నునికి చూడుము కృష్ణా!

ఆ. అరి విమర్ది యితని కై వగ పేటికిఁ
బుణ్యలోకమునకుఁ బోయె ననుచు
నుండ నోపె నేని నుల్లంబు ధృతరాష్ట్రు
దిక్కు లేమిఁ దలఁచి పొక్కుకున్నె.

ఆ. కొడుకు చావు కంటెఁ గోడలి యడలునఁ
బెరిగి శోకవహ్ని దరికొనంగ

నంతరంగ మిప్పు డగ్గల మెరియంగఁ
దొడఁగె దీని కేది తుది యుపేంద్ర.

వీరందఱు కేమి గాని శాంతనవునిఁ జూడ దుఃఖము పొరలుచున్నది.

క. దేవుఁడు గాకితఁడు నరుఁడు
నా వచ్చునె నిష్ఠ పెంపునం బ్రాణంబుల్
తా వలసి నపుడు విడువం
గా వేడుక నునిచినాడు గాదె తనువునన్.

సీ. శాంతనవుండు నాచార్యుండుఁ గర్ణుండు
భూరిశ్రవుఁడు గురుపుత్రకుండుఁ
గృపుఁడు సైంధవుఁడును గృతవర్మయును గురు
రాజు నమానుష రథికవరులుఁ
గలయంగ నెన్నఁడు కొలఁదులవారె! నా
రలిగినఁ జెడుదు రయ్యమరులైన
నట్టివీరులబారి కగపడియుండియు
నేమియుఁ గాకైతి రీవుఁ బాండు

తే. గీ. తనయు లందఱు నీకూర్మి తమ్ముఁడును మ
హాద్భుత మ్మిది దలపఁ భీష్మాదులైన
వారి నట్టి ఘోర నిర్జింప వచ్చు నెట్టి
పనియు భరమె దైవమునకుఁ బద్మనాభ!

అని దుఃఖించి గాంధారి దుఃఖంబునఁ బుట్టిన మహా కోపంబున "నీ రాజకులులకుఁ బుట్టిన యంతఃకలహాముగారణ ముగాఁజేసి యిందఱ నీవు జంపితివి కావున యాదవులును దమలోఁ దామపోరి మడియుదురు గాత! మఱియు నీవు నేఁడు మొదలు ముప్పదియాఱేండ్లు గడచిన చివరదినమున నేకాకివై చచ్చెదవుగాత. మీ యాదువాండ్రు నిట్టుల దుఃఖించెదరు గాత" మని శపించెను. నారాయణుం డల్లన నవ్వి "యిట్టి శాప మిదివఱకు మునివరేణ్యుఁ డొసఁగి యున్నాఁడు. ఇది నీకుఁ జర్వితచర్వణము. ఇకనుడిగి మృతులగు వారల కగ్ని సంస్కారములు సేయుంపు" మని చెప్పెను. ధర్మజుఁడు ధృత రాష్ట్రు నియోగంబున రణహతులకు నగ్నిక్రియ లొనర్పు చుండఁగాఁ గుంతి గద్గదస్వరముతోఁ "గర్ణుఁడు నీసోదరుండు. వానికిఁగూడఁ దిలోదకంబులిడు" మని యతని జన్మవృత్తాంత మ్ంతయుఁ జెప్పెను. పాండవు లధిక శోకమున మునిఁగి కర్ణ నకుఁ గన్నీటితోఁ బాటు తిలాంబువులు విడిచిరి.

ఇది స్త్రీపర్వము.

అవిఘ్నమస్తు.

# భారతసారము

## శాంతి పర్వము..

### మహామునులు పాండవులఁ జూడవచ్చుట.

పాండవులు గంగాతీరంబునఁ బటకుటీరంబుల నిర్మించి కురుపాంచాల స్త్రీలతోడను ధృతరాష్ట్ర విదురాదులతోడను మూఁడుమాసము లాశౌచము దీర్చుచునుండిరి. వ్యాసనారదాద్యనేక మునిజనంబులు పాండవులం జూచుటకు వచ్చుచుఁ బోవుచుండిరి. ధర్మరాజాదులు తమ సోదరుఁడగు కర్ణుని గూల్చినందునకు మిక్కిలి దుఃఖించుచుండిరి. నారదుండు కర్ణుని చరితంబు సాంతమ్ముగాఁ జెప్పి "యతఁడు పరాక్రమవంతుఁడు వాని నెదుర్ప నేరికిని శక్యముకాదు.

చ. వినుము నరేంద్ర! విప్రుఁ డలి
వెక జమదగ్ని సుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము
సేసె వరం బని కోరి కుంతి మా

న్పి నలుక భీష్ముఁ డర్థరథుఁ
జేసి యడంచెఁ గలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి
యయ్యె నరుం డనిఁజంపెఁ గర్ణునిన్."

అని నారదుఁడు వచింపఁ ధర్మజుఁడు మఱియుఁజింతించి యీ యపచారమంతయుఁ గుంతి వలన సంభవించెఁ గదా యని తెలిసికొని యలిగి,

తే. గీ. 'అంగనాజనమ్ములకు రహస్యరక్ష
ణంబు నందలి శక్తి మనంబులందుఁ
గలుగకుండెడు మెల్లలోకముల' నని శ
పించె నాధర్మదేవతా ప్రియసుతుండు.

ఇట్లు కలఁత పడిన మనంబుతో ధర్మజుఁడు "రాజ్యం బొల్ల. మీ రేలికొనుఁడు. నే నడవి కేఁగి మునివృత్తిఁదపంబు సేసెద" నని యందఱును వినఁబలికెను. భీమార్జున నకులసహదేవులును ద్రౌపదియుఁ దక్కు మునిజనంబులును ననేక విధంబుల నతనికి హితోపదేశంబులఁ జేసిరి. అనేకులచరిత్రంబులఁ జాటువులు సెప్పిరి. తఱువాతఁ గృష్ణుఁడు ననేక విధంబులఁ జెప్పెను. బంధువధకును, బ్రహ్మహత్యకును ధర్మజుఁడు మిగుల జింతించుచుండెను. వ్యాసుం డతనిఁజూచి యిట్లనియెను.

సీ. "వినుము కర్మము దెల్పుచును గపాలంబున
నెత్తిన బైక్ష్యాన్న మేకకాల

మశనంబుఁ గొనుచు ఖట్వాంగ చిహ్నము బ్రహ్మ
చర్యంబు నై యధశ్శయనమాచ
రించుచు నిట్లు పంద్రెండువర్షమ్ములు
వ్రతవృత్తి నడుపంగ బ్రహహత్య
కిల్బిషంబు దొఱంగుఁ గృచ్ఛ్రము ల్నడిపిన
నాఱు వత్సరముల నడఁగు మూఁడు.

తే. గీ. హోయనంబులు నడుపఁ జాంద్రాయణములఁ
బోవు నిష్టారతిని మాసభోజియైన
నబ్దమున బోయి నటుగాక యశ్వమేధ
యాజి యగునేని వలదు భిక్షాదు లధిప."

అని మఱియు ననేక ప్రాయశ్చిత్త విధులను దెలిపి ధర్మజునకు "నీవుపోయి శాంతనవుని దర్శించి యతనిచే ధర్మోపదేశముల నందు" మని యానతిచ్చెను. "కరిపురంబునకరిగి యటనుండి గాంగేయు కడకుఁ బోవుట యుక్త" మని కృష్ణుండు సెప్పెను. ధర్మజుఁడు గంగాతీరంబు విడచి సర్వ జనంబుల వెంటఁగొని హస్తిపురముసేరి కృష్ణానుమతంబునఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. పిమ్మటఁ గృష్ణసాత్యకులును, పాండవులును భీష్మునొద్దకుఁ బయనమైరి. మార్గ మధ్యంబునఁ గృష్ణుఁడు ధర్మసూతికిఁ బరశురాము చరిత్రముఁ జెప్పెను. ఇంతలో నందఱును గాంగేయుఁ డున్నయెడ కేఁగిరి. కృష్ణుండు "ధర్మజునకు ధర్మోపదేశంబులు సేయు" మని

భీష్మునితోఁ జెప్పెను. "దేవా! మహానుభావుండ వగు నీ వుండ నల్పబుద్ధి నగు నేను ధర్మంబులు సెప్పుటకు దగను. అదియునుగాక విషప్రయుక్తములగు బాణములు నా తనువున నాటుకొని యుండుటచేత నంగంబులు వికలము లగుచున్నవి. మనంబు చంచలమగు చున్నది. నోటఁ దడి యారుచున్నది. కావున మాటలాడఁ జాల మన్నింపు' మని వేఁడెను. జనార్దనుండు గరుణించి "నీ వట్టి బాధలఁ దొలంగి స్వస్థ చిత్తుఁడ వగునట్లు నేను వరంబుల నిచ్చితిని. ఇంకఁ జెప్పు' మని యానతిచ్చెను. దివిజులు పుష్పవృష్టిఁ గురిసిరి. భీష్ముండు ధర్మజునకు నితిహాసములతో ధర్మంబుల నుపదేశింపఁ బూనెను. యుధిష్ఠిరుఁడు "దేవా!

క. సౌమ్యు లసౌమ్యుల భంగి న
సౌమ్యులు సౌమ్యుల విధమున జనవర చిత్తా
గమ్యతఁ దోఁతురు వారిని
సమ్యఙ్నిశ్చయతఁ గాంచు చందము సెపుమా!
అని శాంతనవు నడిగిన నతఁ డిట్లనియెను.

## వ్యాఘ్రగోమాయు సంవాదము.

"కుమారా! పురిక యను పురమునఁ బౌరికుఁడను రాజు క్రూరకర్ముఁడగుట మఱుజన్మమునఁ బూర్వజ్ఞానముతో గోమాయువై పుట్టి మాంసాహారమును వర్జించి ఫలములఁ దిని బ్రతుకుచుండెను. తోడి నక్క లన్నియును మిక్కిలి

గౌరవంబున 'మాంసమును దెచ్చి యిత్తుము తిను' మని బలవంతము సేసినను వ్రతమును విడువకుండెను. ఒక్క పులి యా నక్కను జూడవచ్చి దానితో సఖ్యంబుఁగోరెను. నీవు మా కాశ్రయణీయుఁడవు. నీతోఁ జెలిమి మోసముఁదెచ్చును అయినను నీ పూర్వమిత్రులమాటఁ దొలఁగి నా యాలోచ నమ్మునఁ బ్రవర్తింతువేని నీచెలిమిఁ గైకొనెద' నని నక్క సెప్పెను. పులి యందున కంగీకరించి దానితో స్నేహముచేసి ప్రతిదినమును మాంసమును గొనితెచ్చి నక్కవశమున నుంచి దాని యిచ్చ చొప్పునఁ బ్రవర్తించుచుండెను. గోమాయువు వశమున నున్న మాంసమును బులియొక్క పూర్వ సచివులు దొలఁగించి యొక మఱుగు చోటున దాఁచి కపట వృత్తిని మెలఁగుచుండిరి. నక్క మాంసమును దొంగ లపహరించు చున్నా' రని పులితోఁ జెప్పెను. పులి యీ సంగతి విచా రించి దొంగలను బట్టుఁడని పూర్వసచివుల కాజ్ఞాపించెను. వారు తమరు దాచి యుంచిన మాంసమునుదెచ్చి 'నక్కయే మాంసమును దాఁచికొని తాను జాటుగాఁ దినఁ దలఁచి నీతో 'దొంగలు గొనిపోయి' రని కల్పనలు చెప్పినది. నక్క యేడ! మాంసమును దినకుండుటేడ. నక్కజిత్తులను నీ వెఱుఁ గవా? ఇదియంతయుఁ గపటమే" యని బొంకి నక్కయందు బులి కసూయఁ బుట్టించిరి. పులి కోపించి గోమాయువును జంపుఁడని పూర్వసచివుల కానతిచ్చెను. ఇంతలోఁ బులి

యొక్కతల్లివచ్చి పూర్వసచివుల కృత్రిమ మంతయును జెప్పినం బులి పశ్చాత్తాపము నొంది "క్షమింపు" మని నక్కను బ్రార్థించెను. గోమాయువు పులి యవివేకమునకుఁ జింతించి వ్యాఘ్రముతో,

ఆ. వె. "ఎఱిఁగియైన నెఱుఁగకేనియు నొక్కని
భంగపెట్టి పిదప సంగతుఁడుగఁ
జేసికొనుట మేలె? సిరిగలవారికి
నట్టి నిలుపు వాని కగునె హితము?"
అని చెప్పి యచ్చోటు వాసి పోయెను. అని గాంగే

యుఁడు ధర్మజునకుఁ జెప్పి

క. వావిరి మాటలఁ దేలక
భావంబునఁ గీడు మేలుఁ బరికించి యస
ద్భావుని సద్భావుని నవ
నీవర! యేర్పఱుప నెఱుఁగ నేరఁగ వలయున్.
అని రాజహితము బోధించెను.

## కుర్కుర నీచత్వము.

ఒక మహామునీశ్వరుని యాశ్రమంబున నన్ని జంతువులును బరస్పరవిరోధములు లేక సుఖముగా మెలఁగు చుండెను. వానిలోఁ నొక పెంటకుక్క యెప్పుడును మునీంద్రుని విడువక యమ్మహాత్ముని వెంట నడవిలోఁ దిరుగుచుండెను. ఒకనాఁడు తాపసి వెంట నున్నపుడు మఱియొక బలిసిన

కుర్కురము దానినిఁ గఱువ వచ్చెను. ఆకుక్క జడిసి తపసి కడకువచ్చి తన పరాభవమును దెలి[illegible]ొనెను. ఆతఁడు కరుణించి తన తపోమహిమచేతఁ దనకడ నున్న కుర్కురమును దృఢతర మగునట్లు గావించెను. అప్పుడా కుర్కురము తన నెదిరిన కుక్కను జయించెను. మఱొకనాఁ డొక పులి యెదిరిన నా ముని తన కుక్కను పెద్దపులినిగఁ జేసెను. ఇంకొకప్పుడు గజ మెదిరినఁ గుక్కను మదగజముగఁ జేసెను. వేఱొకప్పుడు సింగమెదిరిన దీనిని మహాసింగమును జేసెను. ఇట్లు తుదకు దానికి శరభావతార మొసంగెను. ఆకుక్క కీగొప్ప దశ వచ్చుసరికి ప్రపంచమునే మఱచెను. ఋషి యొకనాఁడు తనను బిలువక యెచ్చటికో పోయె ననుకోపమున నాకృతక శరభము "మునీంద్రుని జంపవలె" నని యూహించి కని పెట్టుకొని యుండెను. మునిసత్తముండు దాని తలంపును దివ్య దృష్టిచేనెఱిఁగి దాని నెప్పటియట్ల పెంటకుక్కను గావించెను.

కాపవ్యో పాఖ్యానము.

పారియాత్రాచలంబునఁ గాపవ్యుఁ డను వొక బోయ ధర్మపరుఁడును విలువిద్యయందు నేర్పరియు నరణ్యదేశ మంతయు నెఱిఁగినవాఁడును తల్లిదండ్రులయెడ భక్తిగలవాఁడును నై తల్లిదండ్రులకు మధుర ఫలాహారములు దెచ్చియిచ్చుచు మునిజనుల కపకారమొనర్చిన వారిని భంజించుచుఁ దన జన్మమును సార్థకముఁ జేసికొనుచుండెను. ఇట్లుండగా నా యర

ణ్యమునం దిరుగుచుండిన దొంగలు కొందఱు గాపవ్యుని యొద్దకు వచ్చి "మాకు నాయకుఁడవుగా నుండి మమ్ముఁ గాపాడుచుండు" మని వేఁడిన నతఁడు వారల కిట్లనియె.

సీ. "శిశుజనమునిజన స్త్రీజనంబులఁ జంపఁ
గా దెట్టివాఁడైనఁ గడఁగి మీఁదఁ
గలియుక పోడుచుట కల్మషం బంగనఁ
జెఱఁబట్ట దగదు విశేష మొకఁడు
వినుఁ డెల్ల సత్వంబులను బెంటెఁ జంపుట
పాపంబు గోవుల బ్రాహ్మణులను
సంకట పెట్టంగఁ జనదు తదీయ హి
తము గోరి పూని యుద్ధంబు సేత

తే. గీ. యధికపుణ్యమ్ము సస్యక్రియావిఘాత
మాచరించుట కడు దోష మవని ప్రజకు
బాధ గావించి కుడిచి శవంబుఁ దోలుచు
బ్రువ్వగతి నది డూలియుంగఁ బొలియునతఁడు.

అని బోధించి దస్యుల నందఱను మంచి మార్గములఁ బెట్టి వారలకు మోక్షసాధకుండై ప్రవర్తించెను.

## దీర్ఘదర్శికాది వృత్తాంతము.

దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుఁడు నను మత్స్యముల మూఁడు చాల నీటిజంతువులు గల యొక కొలనుఁగో వసించుచుండెను. ఈ మూఁడిటికిని గల స్నేహము

బంధముచేతఁ దమలోఁ దామిట్లనుకొనిరి. "వేసఁగి కాలము వచ్చుచున్నది. నీటి పాఱుదల కడమ[illegible]లుగక పూర్వము మన మింకొక యింకని నీళ్ళు గల కొలని కేగుట యుక్త"మని దీర్ఘదర్శి చెప్పెను. "యెప్పటి కేది ప్రాప్తమగునో యప్పటి కార్యవుఁ దెఱంగును బట్టి తగునట్లు చేసికొనుట యుచిత" మని ప్రాప్తకాలజ్ఞుండు సెప్పెను. "ఈకొలను సముద్రమువలె నుండఁగా నిప్పుడేమి మూఁడెనని తొందర పడవలయును? అవసరము వచ్చినప్పుడు విచారించుకొన వచ్చు" నని దీర్ఘసూత్రుండు సెప్పెను. దీర్ఘదర్శికిఁ దక్కినవారి యభిప్రాయములు రుచింపక తాను జలమార్గంబున నమ్మడువు వెడలిపోయి యింకొక లోఁతగు మడువుఁ బ్రవేశించి సుఖంబున నుండెను. ఇంతలో జాలరులు వలలఁ బన్ని నీటిలో దిగిరి. ప్రాప్తకాలజ్ఞుఁడు జాలరి మొలనున్న చేఁపలబుట్ట త్రాటినిఁ బట్టుకొని వ్రేలాడుచు వారల పని ముగియువఱకుఁ బట్టువడిన దానివలె నటింపుచు గడపెను. దీర్ఘసూత్రుండు మిన్నక వలలోఁ దగుల్కొనెను. తఱువాత జాలరులు వలలను దెలి నీటఁ గుంజుచుండఁగాఁ బ్రాప్తకాలజ్ఞుఁడా తెలినీటి మడువున దుమికి సుఖంబుననుండెను.

## కిరాత కపోతీయము.

ఒక కిరాతుఁడు చిరకాలమునుండి పక్షులను బట్టుకొని వాటిమాంసమును దాను భుజించుచుఁ బరుల కమ్ముకొనుచు

జీవించుచుండెను. ఇట్లుండ నొకనాఁడు వనమునకు బోయి వలఁ బన్ని పక్షులను బట్టుచుండఁ బెద్ద వానయును గాలి యును వచ్చెను. అడవి యంతయును నీటిమయ మయ్యెను. చీఁకటియావరించినందునఁ గంటికాచీఁకటితప్ప మఱిద్దియును గన్పడుట లేదు. ప్రపంచమంతయు నడఁగిపోవు నంతటి చలి పుట్టెను. ఈ బోయకు దిక్కెదియును దోఁచలేదు. ఆఁకలి దహించు చుండెను. మెల్లగా నొక చెట్టుక్రిందకేఁగి యచ్చట నున్న ఱాతిపై ముడిచికొని కూర్చుండెను. ఎంతసేపటికిని వానయు గాలియు నాఁగలేదు. బోయవాఁడు వృక్షముపైకి చూచి 'యో చెట్టుపైనున్న భూతములారా! మీకు దండ మిడెదను. నాయాఁకలియుఁ జలియుఁదీర్చి నన్ను రక్షింపుఁ' డని యతిభక్తితోఁ బ్రార్థించెను. ఆ చెట్టుతొఱ్ఱలో వసించి యున్న యొక్క కపోతము తన భార్యయగు కపోతి రాకునికి మనంబునఁ జింతించుచు నిట్లనియె "ఆహా! నన్ను విడిచి యెన్నఁడు నింతసేపు వనమున నుండ లేదు. ఈ వాన కేమ య్యెనో! అకటా! నాగుణశీల నాయైహికాముష్మిక సుఖ సాధనము నన్ను విడనాడిన నాబ్రతుకేల? అయ్యో! యీ మందిరము పాడువడుచున్నది. ఇఁక నేమి సేయుదు" నని దుఃఖించుచుండగాఁ నా బోయ వలలోఁ దగుల్కొని యున్న కపోతి పతివాక్యములను విని తనయందాతని కున్న యను రాగమునకు సంతసించి తనగతినిఁ బతికిదెలిపి "విధికృతము

నను వగవం బనిలే" దని ధైర్యముసెప్పి మఱియు నిట్లనియె.

"చ. శరణము సొచ్చినన్ దగఁ
బ్రసన్నతఁ గైకొని రక్షణంబు సా
దరమునఁ జేయు టత్యధిక
ధర్మముగా బుధకోటి సెప్పు నీ
వరసి మహార్తు వీని
శరణాగతు నోదనభంగి నాపదం
బారయక యుండఁ జేయుము
ప్రభూతపు సీతునఁ గొంకు వోయెడున్."

అని చెప్పినఁ గపోతము శోకమువిడిచి రయంబునఁ బోయి కొన్ని పుల్లలఁ జేర్చి పొంతపల్లెనుండి యొక మండుచున్న పుల్లను దెచ్చి చితుకలలో నుంచి యగ్నిం బ్రజ్వలింపఁ జేసి "యొడలు కాచికొ"మ్మని బోయతోఁ జెప్పెను. బోయ యట్లుసేసి చలినిఁ బాసి యాఁకలి బాధ నా పక్షి కెఱింగింపఁ దనకడ నాహారపదార్థములు లేమిఁ జేయునది లేక "నా శరీర మాహారముగా నిచ్చెదఁ గొను" మని వలగొని యగ్నిలోఁ బడెను. ఆపక్షియొక్క దాతృతను మనంబున కెంతయు సంతసించి బోయ వైరాగ్యమును బొంది తన వృత్తిమాని యీశ్వర ధ్యానము సేయుచు నడవిని సంచరించుచు జీవంబు నొల్లక యడవిం దరికొనిన దావానలంబున బడియెను. కపోతియుఁ దన నాథుఁడగు కపోతంపు దనువు నాహారముగాఁ గొనిన

హుతాశనునిఁ బ్రజ్వలింపఁజేసి తానుగూడ నగ్నిఁ దగ్ధ మయ్యెను. ఈ ముప్వురును స్వర్గపదము సేరిరి.

హిమాచల ప్రాంతమునందుఁ జిరకాలవాసియగు నొక బూరుగుచెట్టు గలదు. నారదుఁ డొకనాఁడు దీర్ఘము లగు శాఖలతోడను, బలిసిన కాండముతోడను జిగురు జొంపములతోడను వెలయుచున్న యా చెట్టును జూచి "నీవు చిరకాలము బ్రదికితివి. పవనుఁడు వృక్షవైరి. నీ వాతని బారిఁబడక యెట్లు జీవింపఁ గలిగితి" వని యడిగెను. ఆ తరువు గర్వించి దుర్బలుఁడగు పవనుఁడు న న్నేమి సేయఁ గలఁడు? నా బలమున కతఁడు లొచ్చుగుటచేతనే మిన్నకుండె" నని రజ్జులాడెను. నారదుఁ డేగి యా వచనములు గంధవహున కెఱింగించి వాని కలుక పుట్టించెను. ప్రభంజనుఁడు శాల్మలినిఁ గాంచి "ఏమి? మితిమీఱి మాట లాడితివఁట? నీ గర్వమడంపవలయునా? " యని యడిగెను. శాల్మలీ తరువు వెనుదీయక "నీవు న న్నేమిసేయగలవు? నే నాడిన మాట సత్యమే" యని యెదిరించెను. పవనుఁడు "రేపకడవచ్చి నీ మద ముడిపెద" నని శపథము సేసి పోయెను. బూరుగు తన యసమర్థ గర్వాలాపములకు నొచ్చుకొని ప్రభంజనునిచే భంజింపఁబడకుండునట్లు తన శాఖను దానే విఱచుకొని మోడై యుండెను. మఱునాఁడు పవనుఁడు వచ్చి చూచి దాని దీనత్వమునకు నిందించి యేఁగెను.

## నాడీజంఘుని చరిత్రము.

ఒక బ్రాహ్మణుఁడు కుల శీలములను బాసి యొక బోయదానినిఁ బెండ్లాడి కిరాతులను గూడి వేఁట లాడుచు మాంసభక్షణము సేయుచు ధనార్జనాసక్తుఁడై వణిగ్జనుల సహవాసమును బట్టి వారలతో నొక యరణ్యమార్గమునఁ బోవుచుండెను. అప్పుడొక మదగజమువచ్చి యా మూఁకను జెండాడుచుండఁగా నతఁడు తప్పించుకొని పాఱిపోయి యొక వట వృక్షము క్రిందఁ జేరెను. ఆ భూమిజముమీఁద నాడీజంఘుఁ డను బకరాజము చిరకాలము నుండియు వసించియుండెను. ఈ విప్రునిఁ జూచి "నీవెవ్వఁడవు? ఎచ్చటినుండి యెచ్చటికిఁ బోవుచు నిటు వచ్చితివి? ఇప్పుడు నిన్ను నాహారముగాఁ గొనెద" నని యా బకము సెప్పెను. ఆపలుకులకు విప్రుఁడు భీతిలి తనవృత్తాంత మంతయును జెప్పి 'రక్షింపు' మని శరణాగతుఁ డయ్యెను. బ్రహ్మకు మిత్రుఁడైన యాబక రాజు బాపనియెడఁ గరుణగలిగి వాని కభయమిచ్చి స్నేహభావము వహించి వానితో నిట్లనియె. "ఓయీ! నీవు నాకు బరమ మిత్రుఁడవైతివి, నీకు నేను సకల సౌభాగ్యములను గూర్చెదను. ఈ ఫలములతో నీ క్షుత్తును ప్రస్తుతము తీర్చికొనుము. మఱియు,

క. విను మిత్రుండును, రజితమ్ముఁ
గనకము, బుద్ధియును నాల్గు కారణములు మ

ర్త్యుని దారిద్ర్యము వాయుట
కని దేవగురుండు సెప్పె నన్నిటిలోనన్.

క. మిత్రుం డెక్కుడు కాశ్యప
పుత్రుఁడ నగు నేను నీకు భూసురవర! స
న్మైత్రి యనుష్ఠించెద నెటు
పాత్రము గాకుండదే యపార శ్రీకిన్

మధువ్రజపురమున నామితుఁడగు విరూపాక్షుఁ డను దానవుఁడు గలఁడు వాని పాలికేగి "నేను బంపితి" ననుము. "నీకు సకలసౌభాగ్యముల నిచ్చు" నని చెప్పెను. విప్రుఁడతని కడకేఁగినతోడనే "యితఁడుదుష్టుఁ" డని తెలిసికొనియు దనమితుఁడగు నాడీజంఘునకు మన్ననీయుఁ డగుటం జేసి తన యింటికడ భుజించుచున్న వేయిమంది బ్రాహ్మణుల పంక్తి నతనికి భోజనముఁ బెట్టి యతఁడు మోయగలిగినన్ని మణులును గనకమును నిచ్చెను. వానిని మూఁపునమోసికొనిమరల మఱ్ఱిచెట్టు దగ్గరకు వచ్చెను. నాడీజంఘుఁడు నిద్రించుచుండెను. అపాత్రవృత్తిగల యా బ్రాహ్మణుఁడు బకమును జూచి బలిసియున్న దాని యొడలి మాంసమును దినవలయునను బుద్ధి పుట్టి బకమును వధించి దాని డొక్కలోని మాంసమును దినెను. విరూపాక్షుండు నాఁడు తన మిత్రుఁడగు నాడీజంఘుడు రాకుండుట చేతను, మనంబు కలతపడి యుండుట చేతను మితునకేదియో యపచారము గలిగియుండు నని తలఁచి

యనుచరుల నంపెను. వారలు వచ్చి మృతుఁడైన బకరాజును పాఱిపోయిన విప్రుని బట్టి విరూపాక్షునికడకు గొనివచ్చిరి. అతఁడు దుఃఖించి విప్రుని మొగము చూడనోల్లక "వానినిఁజంపి తినుఁ" డని దనుజ భటుల కాజ్ఞాపించెను. దుష్టుని మాంసము దిన నోల్లక వారలు వాని మేనుఁ జీల్చి కుక్కలకుం వేసిరి. ఈమిత్రద్రోహి మాంసమును గుక్కలును ముట్ట కుండెను. బ్రహ్మేంద్రాదులు నాడీజంఘుని కళేబరమును జూడ వచ్చిరి. వారితోఁ గామధేనువును వచ్చెను. లేఁగ ధేనువు పాలు గుడిచి మూఁతి నున్న పాల నురుగును బకముపై రాల్చెను. అమృత స్పర్శమున బకము జీవములుగాంచి మిత్రుఁడగు విప్రుని నరక బాధఁ దొలఁగించి "బ్రతికింపుమని" విధిని వేఁడెను. బ్రహ్మ నాడీ జంఘుని మిత్రవత్సలతకు మెచ్చివిప్రుని బ్రదికించెను. విప్రుఁడును జ్ఞానముగని తపసి యయ్యెను.

ఇది శాంతిపర్వము.



అవిఘ్నమస్తు.

# భారతసారము.

## అనుశాసనిక పర్వము.

### ధర్మజుని పశ్చాత్తాపము.

ధర్మరాజు భీష్మోపదేశితములైన ధర్మము లన్నిటిని గ్రహించియు బంధువధ వలనఁ గలిగిన మనోవ్యథ మిక్కిలి బాధించుచుండుటంజేసి చింతాక్రాంతుఁడై దేవా! మూర్ఖుఁడగు సుయోధనుండు రాజ్యమున నా జనకుని పాలు నా కొసంగక సర్వమును దానే యపహరించవలెనను దుర్బుద్ధి గాంచుటచేతను, నేను రాజ్యభాగమునందు విరక్తుఁడను గాకుండుటచేతను, యుద్ధము సంప్రాప్తమైనది. దాన సకల జననాశనము కలిగినది. ఈ జనక్షయమునకు మే మిరువురమును స్వార్థ పరాయణుల మగుటయే కారణము. అందుచేత మేము నెత్తురుకూఁడు తినవలసివచ్చినది. సుయోధనుండు వీరస్వర్గము ననుభవించుచున్నాడు. అకారణ జనక్షయము గలిగించిన మహాపాతకము ననుభవించుటకు నేను బ్రదికి యున్నాఁడను.

త్రిలోకవంద్యుఁడవగు నిన్ను "బ్రాహ్మణులకొఱకు కల్పవృక్షమును నఱికి నట్లు కదనమ్మున గూల్చిన మా యట్టి హీనులకు సద్గతులు గలుగఁ జాలునే ! ఇసీ! ఇఁక నీ రాజ్యత్యాగము సేసి మహాతపం బొనరించి యీ పాతకములను బాయు టొప్పు. నన్ననుగ్రహింపు" మని భీష్ముని వేఁడెను.

భీష్మోపదేశములు.

గౌతమీ లుబ్ధక సర్ప మృత్యుకాల సంవాదము.

ఆతని పలుకులు విని "కుమారా ! నీవు చింతింప కుము. వధించుటకు మనుజుఁడు కర్తగాఁడు. నీకొక్క యితి హాసము సెప్పెదను వినుము. గౌతమి యను నొక శాంత స్వభావయగు భూసురాంగన కలదు. ఆమె పసికొమరుఁడు సర్పదష్టుఁడై మృతినొందెను. కిరాతుఁడొకఁడా సర్పమును త్రాటఁ గట్టి తెచ్చి అమ్మా ! ఈసర్పమే నీ పాపను జంపినది. దీనినిఁ గోలతో మోదియో కత్తితో నఱికియో వధింపఁ బూనితిని. ఎట్లు సంపుట నీ యిష్టమో తెలుపు" మనెను. అంత వారల కిట్లు సంభాషణము జరిగెను.

గౌతమి:—అర్జునకా ! ఈపామును జంపిన నా సుతుఁడు బ్రతుక నోపఁడు. నిష్కారణముగ జీవహింస సేయ కుము. విధివశమున వచ్చినకీడును నధములు లెక్క సేసి నిమిత్తకులను దూరుదురు. ప్రాజ్ఞుల కది సెల్లదు. కావున సర్పమును విడువుము.

అర్జు—తల్లి! నీవు బేలవు. విష జంతువులను మన్నింపఁ దగదు. దేవేంద్రుఁడు క్రూరుఁడగు వృత్రుఁ జంప లేదా? ఫాలనేత్రుండు యజ్ఞధ్వంస మొనరింప లేదా? కావున నీవీ సర్పమును జంపుట కియ్యకొనుము.

గౌత—లుబ్ధకా నీమాటలు నాకు రుచింపవు. ఆ జగత్కర్త యాజ్ఞ లేనిది జీవుల కేహానియును గలుగదు. జీవి కర్మము తెఱంగున ఫలాఫలములఁ గుడుచు చుండును. ఈ బాలుఁడు తనకర్మవశమున మృతుండయ్యెను. సర్పము నేల చంపవలయును? విడువుము.

అర్జు—తల్లీ! నీ వమాయకురాలవు. నీకు దెలియదు. నేను భుజగమును జంపక మానను.

సర్పము—ఓయీ! లుబ్ధకా! నే నేమి తప్పు సేసితిని? మృత్యుపరాధీనత నీబాలునిఁ గఱచితిని గాని నా మనంబున గామ క్రోధములు లేవు.

అర్జు—నీవు మృత్యువునకు సాధనమగు క్రూర జంతువవు, గావున నే నిన్ను వధింపఁ బూనితిని.

సర్ప—కుమ్మరివాని సారెను, గోలను బోలిన సాధనమును గాని నేను గర్తనుగాను. బాగుగా నాలోచించుకొనుము. కాకున్న నీ క్రియ నావశమగునా?

అర్జు— తే. గీ. ఏయువాఁడుండ నన్నేమి సేయు ననక
చూపి తత్ఖండనము సేఁత పాప మండ్రె?

యెవ్వారేఁ బంప గఱతుఁ గాకేమి కూ్రరు
నిన్ను గీటడఁగించిన నిందరాదు.

విశేషించి మృత్యువునకు సాధనములుగా నిర్మింపఁబడిన పాపజాతిని యెల్లభంగులఁ జంపుటయే యుచితము.

సర్ప—ఫలాఫలములుఁ బుణ్యాపాపములు గర్తను జెందును గాని సాధనమును జెందనేరవు. ఋత్విజుఁడిడిన హవిస్సులవలనఁ గలుగు ఫలము కర్తకే చెందును. హవిస్సు నిమిత్తమే.

మృత్యువు—సర్పమా! నిన్ను నేఁ బనిచినట్లు నన్ను గాలుఁడు నంపె. ఈ చావునకుఁ గాలుఁడు కర్తగాని నీవును నేనును గాము. పంచ భూతములును గాలుని యఱచేత వర్తించుట యెఱింగియు నన్ను నిందించుట తగదు.

కాలుఁడు—అర్జునకా!

క. పామును మృత్యువు నేనును
గా మీదారకుని మృతికిఁ గారణ మీతం
డేమేఁ గర్మముఁ జేసెం
దా మృతిఁ బొందించె నదియ తలకొని యితనిన్.

గౌత—అర్జునకా! వింటివి గదా!

క. సకల జనంబులుఁ గర్మము
నకు ననుగుణమైన తెరువునం బోదురు దీ

నికి రోష విషాదము లే
టికి విడువుము పాము సంఘటింపుము శమముఁ.

అని చెప్పిన విని ధర్మజుఁ డిట్లనియె.

## భీష్మ నిర్యాణము.

ఇట్లు భీష్ముఁ డనేక ధర్మోపదేశములఁ గావించి ధర్మజుని బ్రీతునిఁ జేసి ధృతరాష్ట్రునిఁ బిలిపించి 'విచారంబుదక్కి పాండవులను సుతులుగా భావించుకొని దైవచింతనమునఁ గాలము గడుపు' మని బోధించి యుత్తరాయణపుణ్యకాలము కల్గుటచేత స్వాచ్ఛందమరణుండగు శాంతనవుఁడు జీవన్ముక్తుఁడయ్యెను. ధృతరాష్ట్రవిదుర ప్రముఖులును బాండవులును సమ్మోహాను భావుఁ డస్తమించుటకుఁ జింతించుచుండిరి. అంతకుమున్న భీష్మునిఁ బరివేష్టించి యున్న మునిపుంగవులు వారల నూరార్చిరి. ధర్మజుఁడు తక్కువారినిఁ దీసికొని గంగాతీరమ్మున కేగి భీష్మునకుఁ గుదకక్రియల నెఱవేర్చి కరిపురమ్మునకు బయనమయ్యెను.

ఇది అనుశాసనిక పర్వము.

---

అవిఘ్నమస్తు.

# భారతసారము

## అశ్వమేధ పర్వము.

### ధర్మజుఁ డశ్వమేధమునకుఁ బూనుట.

ధర్మరాజట్లు ప్రయాణమై నడుచుచు దుఃఖభారమ్మున విస్మితుండయి క్రూరాస్త్రపాతమ్మునఁ గూలు నేనుంగుఁబోలెఁ గ్రిందఁబడుచుండఁ గృష్ణుని సన్నఁ గైకొని భీమసేనుఁ డతనిఁబట్టి యల్లన దన తలచీరఁ బఱచి పరుండఁ బెట్టెను. అందఱు దుఃఖాక్రాంతులయిరి. ధృతరాష్ట్రుఁ డోదార్చెను. 'మృతులగు బంధుల కొఱకేడ్చిన సద్గతిభంగ మగు' నని కృష్ణుండు సెప్పెను. వేదవ్యాసమునీంద్రుండు ధర్మజు నూరార్చెను. ఇవి యన్నియు విని వ్యాసుని 'దేవా! మీరు దేవ సమానులరు. నాహితమును గూర్చువారు. భీష్మునిఁ గర్ణునిఁ జంపిన మహాపాతకమునకుఁ బరిహారముగా నేనడవికిఁబోయి తపమాచరించు నట్లనుగ్రహింపుఁ' డని వేఁడెను. వ్యాసుఁడు నిష్ఠుర వాక్యములతో నతనిని మందలించి మఱియు నిట్లనియె. 'రాజా! పూర్వము మరుత్తనురాజు శతాశ్వమేధముల నొనరించి యపారమగు ధనమును విప్రుల కొసఁగెను. ఆ విప్రు లాధనమును భరింపఁ జాలక హిమవత్పర్వత ప్రాంతమునఁ బాతి పెట్టి యెవ్వరికి దొఱకిన వారిదీ ధన' మనిరి.

నీవునీ యనుజులం బంపి యాధనమును దెచ్చి విపుల మగు దక్షిణలతో నశ్వమేధక్రతు వొనరింపు" మని చెప్పిన ధర్మజుఁడు మహాసంతోషమున నందుల కంగీకరించి కరిపురంబున కరిగెను. ధర్మజుండు సుఖంబుగ రాజ్యపాలన మొనరించు తఱిని కృష్ణార్జునులు స్నేహవిలాపములతో నచ్చ టచ్చటఁ దిరుగుచుండిరి. కృష్ణుం డర్జునునకుఁ దత్త్వజ్ఞానమును స్థిరీకరణము సేసి శ్లేష్మాది రోగ వికారనిరూపణమును బ్రాహ్మణగీతలును జీవాత్మ స్వరూప నిరూపణమును, గురుశిష్య సంవాదంబులు, మున్నగు ననేకవిషయములను బోధించెను. సుభద్రాదులు సౌభద్రుని స్మృతినిఁ దలఁచి తద్దయు దుఃఖించుచుండ వేదవ్యాసుండు విచ్చేసి వారల దుఃఖ మపనయించి ధర్మరాజు క్రతుదీక్షఁ గైకొమ్మని బోధించెను.

## అర్జునుఁ డశ్వరక్ష కేఁగుట.

యుధిష్ఠిరుఁ డందుల కామోదించి హిమవన్నగప్రాంత ధనమును దెప్పించి సకల బంధుజనంబులను రావించి క్రతుదీక్షాపరుఁడయ్యెను, భీముని నకులుని రాజ్య రక్షణమునకు నియోగించెను. సహదేవుని యజ్ఞద్రవ్యములను సమకూర్చుటకు నియోగించెను. ఇఁక దివ్యాస్త్రధనబహుళుండగు ధనంజయుని క్రత్వశ్వమును రక్షించుటకు నియోగించిన నతఁడు ధనుర్ధరుఁడయి కతిపయసైన్యంబుల సహాయంబుగాఁ గొని కృష్ణసాత్యవతేయ యుధిష్ఠిరులకు నమస్కరించి మహాశీర్వాద

ములనంది యాశ్వము వెంటనంటెను. అశ్వమును గ్రమక్రమముగా బంధించిన త్రిగర్త దేశాధీశులను, సింధు దేశాధిపతులను మఱియు ననేక శూరులను బవరమున నోడించి హాయమును రక్షించి ముందుఁ జనుచుండెను.

## బభ్రువాహనుని యుద్ధము.

ఆ యాశ్వంబు మణిపూరపురము దరి కేఁగిన నా దేశాధిపతియగు బభ్రువాహనుఁడు తనతండ్రియగు నర్జునుని రాక విని పరివార జనంబులతో నతని కెదురుగాఁ బోయి నమస్కరింపఁ బార్థుఁడు "మూర్ఖా! యోపిన నెదురుము. లేదేని బొమ్ము. నమస్కరింతువేల"? యని తిరస్కరించెను. బభ్రువాహనుఁడు చిన్నపుచ్చుకొని తిరిగిపోవుచుండఁగా నక్కుమారుని తల్లియగు నులూపి యెదురై నీ తండ్రితో యుద్ధము సేయుమని ప్రోత్సాహపఱచి యర్జునునిఁ గూల్పఁదగిన మంత్ర బలము నాతనియం దావహింపజేసెను. అబాలుఁ డాడు గఱచి మరలివచ్చి పార్థునిఁ దలపడి ఘోరముగాఁ బోరి యొక్క క్రూరనారాచము సేయ నది పార్థుని వక్షమునఁ దాఁకి వీపునదూసిపోవ నతఁడు వజ్రనిహతమగు నద్రివోలె గ్రిందఁ బడియెను. ఆ ప్రక్కనే కాచియున్న చిత్రాంగదయు నులూపియు వెంటనే డాయం జని సంజీవ మణి ప్రభావమునఁ బునర్జీవితునిఁ జేసిరి.

## పార్థుని శాపప్రకారము.

అర్జునుఁడు నిదుర వోయి లేచినట్లు పునర్జీవితుఁడై సన్నిధి నుపచరించుచున్న యులూపి చిత్రాంగదాబభ్రువాహనులనుఁ గాంచి యచ్చెరు వొంది కుమారుని విజయంబునకుఁ బ్రీతిహృదయుఁడై యున్నతఱి నులూపి పార్థునితో నిట్లులని యెను. "నాథా! నేనొకనాఁడు గంగానదికి స్నానార్థమేఁగితిని. వసువులు నచ్చటికి వచ్చి మజ్జన మాడుచుండిరి. గంగాదేవి మనుష్యస్త్రీరూపమునంది వారలలోఁ దన కుమారుఁడు గూలిన దుఃఖమును దలపోసికొనెను. వారలునుశోకించి "కృపణవృత్తిచే గిరిశిఖంపై నెదుటఁబెట్టుకొని గాంగేయుం డేయుచుండం గ్రూరబాణంబుల నొంచి కుత్సితజయం బపేక్షించికూల్చెఁ గావున నతఁడు తనువు విడిచి నరకంబు కేఁగుగాత" యని శపించిరి. ఏనత్తెఱంగును నాజనకునకు తత్క్షణంబ చెప్ప నమ్మహాత్ముఁడు వచ్చి వారల దర్శించి శాపమోక్షము వేఁడిన "నతడు కుమారునిచేఁ బరాజితుఁడైనపుడు శాపమోక్షము గలుగు"నని యనుగ్రహించిరి. దానం జేసి రణవిముఖుఁడైన నీ తనయునిఁ బురికొల్పి భావి సుఖార్థ మీరణమునుగల్పించిసంజీవమణిప్రభావమున మరల నిన్ను బ్రదికించితిని. ఈ తప్పుసైరింపు" మని వేఁడెను. అర్జునుఁడు విస్మితాననుండై కన్నులనుండియానంద బాష్పముల రాల్చుచు నధిక ప్రేమంబున నాముగ్వుర గౌరవించి వారలను గరిపురంబునకుఁ బోవ నియోగించి తా నశ్వము వెంటఁ

జని యశ్వముసుబట్టిన జరాసంధ పౌత్రుని, గాంధారిపతిని,నింక ననేక విఘ్నకర్తలను బరాజితులం జేసి విజయోత్సాహంబులతోఁ గరిపురంబు సేరెను.

## అశ్వమేధ క్రతుసమాప్తి

ధర్మజుఁడు పార్థుని గౌఁగిలించుకొని మహోత్సంతోష ముతో శుభాశీర్వాదముల నొసంగి వేదవ్యాసమహాముని యుప ద్రష్టగా యాగంబును నిర్విఘ్నత నిర్వర్తించి యనేక భూసురు లకును మునిజనులకు నపారమగు కనకదానంబులొసంగి వ్యాసు నకు యజ్ఞదక్షిణగాఁ దన రాజ్యము నంతయు నొసంగెను. ప్రేక్షకులగు రాజవర్యులును విప్రులును బంధులును, నత్యాశ్చ ర్యభరితులై యేకగ్రీవముగ ధర్మజని దాతృతను గొనియాడిరి. పారాశర్యమునీంద్రుండా దానమును బరిగ్రహించి 'రాజా ! నేను బ్రహ్మణవృత్తి మెలంగెడువాఁడను. నాకు రాజ్యపాలనం బర్హకృత్యంబుగాదు. నాకు వెలయిచ్చి వసుధఁ గొను' మని చెప్పెను. అచ్చట నున్న మునిముఖ్యులందఱును ధర్మజునితో నదియే యర్హకృత్యం బని యేకగ్రీవముగాఁ బలికిరి. యుధిష్ఠి రుఁడు కోటిగోటులమాడల వెలయిచ్చి రాజ్యమును గొనెను. వ్యాసుండా ధనమును గొని విప్రులకుఁ బంచియిచ్చెను. ధర్మ జుఁడు రాజులనెల్ల సత్కరించి వారి వారి యిండ్ల కనిచెను.

ఇది అశ్వమేధ పర్వము.

---

# భారతసారము.

## ఆశ్రమవాస పర్వము.

### అంబికేయాదులు వాన ప్రస్థమున కరుగుట.

ఈ క్రతురూపమున ధర్మజుఁడు దిగంతమగు సత్కీర్తిని సంగ్రహించి యాంబికేయుని సింహాసనంబున నుంచి యతని మనంబున కించుకయేనియు నలజడి కలుగకుండ శుశ్రూషలొనర్చుచు రాజ్యంబును బూజ్యంబుగా బాలించు చుండెను. భీమసేనుఁడు మాత్రము సుయోధనుని దుర్నీతికి ధృతరాష్ట్రుఁడు గారణభూతుఁడను కోపము తన మనంబున నాటుకొని యుండుటంజేసి కుపితమనస్కుఁడై వృద్ధనృపతి యెదుట "దుర్మార్గులైన దుర్యోధనాదులు నూర్వురును నా బాహుపంజరమునఁ జిక్కి మడిసిరి. శత్రుఘాత మొనరింప జాలిన యీ భుజములను బుష్పమాలికచే నలంకరించి పూజించుచుంటి" నని యెత్తిపొడుపుగ మాటలాడు చుండెను. ఇది నకుల సహదేవులుమాత్రము దెలిసియు నగ్రజుని యెడ భక్తిమెయి మనంబునంద యునిచిరి. తక్కవారెఱుంగరు. ఇట్లు

పదునేను వత్సరంబు యాంబికేయుఁడు గడపి "తానరణ్యమున కేఁగి తపోవృత్తిగాయంబుఁ బాసి సద్గతులు వడసెద" నని ధర్మజునితోఁ జెప్పెను. అతఁడు దుఃఖించి "వల" దని వారించెను. సాత్యవతేయుఁడు ధర్మజు నొప్పించి యాంబికేయుని యాశ్రమస్వీకరణమును స్థిరపర్చెను. ఆంబికేయుఁడు ధర్మజార్జునుల పనుపున రణనిహతులగు గాంగేయ ద్రోణ దుర్యోధనాదులందఱకును వేఱు వేఱఁ బారలౌకిక క్రియలఁ గావించి దేవ భూసురుల కనేకాగ్రహారముల నొసంగి ధనకనకాదుల నిచ్చి తృప్తమనస్కుఁడై గాంధారీ సహితంబుగ వనాభిముఖంబుగఁ బయనమయ్యెను. వారలతోఁ గుంతియువిదుర యుయుత్సకృపాచార్యులును బయనమైరి. పాండవులు కుంతినిఁ "బోవల" దని యనేకవిధంబులఁ బ్రార్థించిరి. ఆమె వినక యరిగెను. ఇట్లు వారందఱును బాండవులను బౌరులను నిలిపి గంగానది నుత్తరించి విదురుఁ డమర్చిన దర్భశయ్యలయందు బవళించి యా రాత్రిఁ గడపిరి. మరునాఁడు వేకువఁ గాలోచిత కృత్యంబుల నిర్వర్తించి యొక యిసుకతిన్నె పయిఁ జెట్టునీడను గూర్చుండి యుండఁగా శతయూపుఁడను రాజర్షి యెదురు వచ్చి యర్ఘ్య పాద్యాది విధులను జేసి వారలఁ దన తపోవనమున నుండఁ బ్రార్థించెను. ధృతరాష్ట్రుఁడు నామోదించుటఁ గని విదురుడచ్చటఁ బర్ణశాలల నిర్మించెను. అందఱును దపో నియతులై యచటనుండిరి.

## ధృతరాష్ట్రాదుల నిర్యాణము.

ఒకనాఁడు నారదుఁడు ధృతరాష్ట్రుని కడకువచ్చి సురలోకంబున సుయోధనాదుల సుఖస్థితు లెఱింగి కౌరవాన్వయమున కంతకును సద్గతులు సంప్రాప్తమగునని చెప్పెను మఱియుఁ బాండవులును బంధుజనదూరతకు దుఃఖించుచు నిన్నుఁ జూడఁదలఁచియున్నారనియుఁ జెప్పెను. కతిపయదినంబులకుఁ బాండవులును భర్తృవియోగులగు కురుభామినులును దపోవనమున నున్న ధృతరాష్ట్రునిఁ జూడఁబోయిరి. అప్పుడు నిజాశ్రమస్థలమును విడిచి గంగాస్నానంబున కేఁగిన గాంధారీ ధృతరాష్ట్రాదులును గుంతియు విదురాదులును గృతస్నాతులై మగిడి వచ్చుచుండ నెదురేఁగి పాండవులును దక్కువారలును నమస్కరించినఁ బరమానందభరితులై యాశీర్వదించి ఫలాహారములం దృప్తుల జేసి కుశలంబడిగి యుండ విదురుండు దూరముగఁ బోవుచుండుటఁ గని ధర్మజుఁడు వెంబడి చనియెను? విదురుఁడు యోగముఁబట్టి తన తేజంబును ధర్మజ శరీరంబునఁ గలిపెను. పిదప వ్యాసుండు వచ్చి యందఱను గుశలంబడిగి రణనిహతులగు స్వజనంబులను దలఁచికొని దుఃఖించుచుండిన గాంధారియొక్కయుఁ గుంతియొక్కయు నభిమతంబులం గ్రహించి పారాశర్యుం డచట వారి నందఱను గంగాతీరంబునకుఁ గొనిపోయి తాను జలంబులలోదిగి ధ్యానమభినయించి 'రం' డనినతోడనే కురుకుమార శతంబును

గర్ణుండును, ద్రోణి, భీష్మాదులును, శకుని, శల్యులును, ద్రుపద ధృష్టద్యుమ్నులును, విరటుఁడు నభిమన్యుఁడు మొదలుగాఁగల వీరస్వర్గమనుభవించెడు పురుషులందఱును వచ్చిరి. వారలతో నందఱును నొకదినము కలసి మెలసి యుండిరి. ధృతరాష్ట్రునకు దివ్యదృష్టి నొసంగిన నతఁడును వారలఁ జూచి యానందించి వ్యాసుని మహాతపఃప్రభావమున కచ్చెరువందెను. మఱునాఁడు స్వర్గస్థులందఱును స్వదేశంబున కరుగుటకు గంగాజలంబులం జొచ్చిరి. వ్యాసు ననుమతంబున వీరుపురుషుల భార్యలగువిధవ స్త్రీలందఱును గూడ నా జలంబునఁ గ్రుంకు లిడుచు దివ్య తనువులం దాల్చి తమతమ పతుల సన్నిధానమును గాంచిరి. పాండవులును స్వస్త్రీ జనంబులతోఁ బరివారము వెంటఁగొని కరిపురంబున కరిగిరి. కుంతియు గాంధారి ధృతరాష్ట్రులును సంజయుఁడును దపోవనమునకుఁ బోయి యచ్చటఁ గొంత కాలము తపమొనరించి వ్యాసనారదాది మహామునుల కృపకుఁ బాత్రులై యోగవిద్యాబలంబునఁ దమతమశరీరంబులనువిడిచి దివి కేఁగిరి. నారద మునీంద్రుని వలన మాతాపితల మరణ వార్త నాకర్ణించి పాండవులు మితిమీఱుదుఃఖమున మునింగిరి. నారదుఁడు వారల కుచితరీతిని దుఃఖశాంతి నొనర్చెను. పిదప ధర్మజుఁడు ధృతరాష్ట్రాదులకుఁ దిలోదక దానంబులు గావించెను.

ఇది ఆశ్రమవాసపర్వము.

# భారతసారము.

## మౌసల పర్వము.

### యాదవుల దుస్థితి.

ధర్మజుని రాజ్యంబున ననేకములగు నుత్పాతములు పుట్టినవి. అతఁడప్పటికి ముప్పదియైదు సంవత్సరములు రాజ్యపరిపాలన మొనరించెను. రాజ్యోత్పాతములకు ధర్మజుఁడును దమ్ములును మిక్కిలి చింతించుచు నుండిరి. అట ద్వారకానగరంబున నరిష్టము లనేకములు కలిగినవి. పతులయందు భార్యలకు లక్ష్యములు తప్పెను. స్త్రీలు స్వేచ్ఛావృత్తి మరఁగి యవినీతిఁ జారబడిరి. పురుషులకు బ్రాహ్మణభక్తి నశించినది. గురుభక్తిపోయినది. ఒకనాఁడు ద్వారవతికిఁ గణ్వుండును, నారద మునివరుఁడును, గాధినందనుఁడును, శ్రీకృష్ణుని దర్శించుటకు వచ్చిరి. వారినిజూచి వృష్టికుమారులు మనంబున నిర్లక్ష్యముగాంచి యమ్మహాత్ములను హాస్యాస్పదులనుగాఁ జేయనెంచి సాంబునకు స్త్రీవేషము వేసి వారియొద్దకుఁ దీసికొనివచ్చి "దేవా! యీ భామిని ప్రభూ గేనేరి. ఈ కాం

తకు సంతానప్రాప్తికలదా?" యని ప్రశ్నించిరి. ఆ మునులా యాగడమును దపోదృష్టిం దెలిసికొని కుపితులై "ఆ! కనును. ఈమె గర్భమునుండి యొకముసలము వెలువడును. బలదేవుం డును దామోదరుండును దక్కఁదక్కిన యాదవు లందఱును నమ్ముసలము శక్తివలన నశింతురు. హలాయుధుఁడు సముద్ర మునం జొచ్చును. కృష్ణుఁడడవిలో భూశయనుండై యుండు తఱిని "జర" యను రక్కసి వాని మడియించును. ఇది మీ దుర్నయమునకుఁ దగిన ఫల" మని శపించి మగిడి పోయిరి. వారి మాట చొప్పున సాంబుని కడుపున ముసలము పుట్టెను. వసుదేవున కీ సంగతి తెలిసి యాముసలమును జూర్ణముగాఁ గొట్టించి సముద్రమునఁ గలిపించెను. ఆ రేయి నొక రాక్ష సాంగ యిండ్లలోఁ జొచ్చి స్త్రీలను బయటికీడ్చి భూషణ ముల హరించెను. మఱునాఁడుదయమునఁ గృష్ణుని చక్రమును రథమును గగనంబున కెగసెను. కృష్ణానుమతంబున నందఱును సముద్రతీరమున జాతర సేయుటకు బయల్వెడలిరి. బలరాముండు దపోవృత్తిఁ గడుదూరమున నొకవృక్షము నీడఁ గూర్చుండెను. యాదవ వృష్ణ్యంధక వీరులు గృష్ణునితో సముద్రతీరమ్మునఁ చేరి పానమత్తులై మహోల్లాసముతోడ నొడలెఱుంగకుండిరి.

### యాదవ వధ.

అందుసాత్యకి కృతవర్మనుజూచి యధిక్షేపించుచు "నిసీ! నిశీసమయంబున నిద్రబోవుచున్న పాంచాల బలంబు

లను గసాయి విధమ్మునఁ గసిమసంగుట యెంతపాప మెంత యపౌరుష' మని నలువురు వినునట్లు పలికెను. కృతవర్మ కోపించి "భూరిశ్రవుని హస్తమును బార్థుఁడు నఱికిన పిమ్మట వాని శిరంబును ద్రుంచుట పౌరుషముగాఁ బోలు" నని కృతవర్మ సెప్పెను. ఒడలెఱుఁగని వీరిరువురును రోషంబున నొండొరులఁ గదిసిపోరిరి. సాత్యకి కృతవర్మ శిరంబు దునిమెను. ఆకోపమున నచ్చట నున్న వారందఱును గుపితులై ముసల చూర్ణ ప్రభావమున సముద్ర ప్రాంతమునందు మొల్చిన ముమ్మొన జమ్ము నాయుధములుగాఁ గొని యొండొరులను నఱికికొని నిశ్శేషముగా హతులైరి. కృష్ణుండు తన సారథి యగు దారకును "నర్జునుఁదోడితె"మ్మని కరిపురంబున కంపి యచట నున్న స్త్రీజనంబుల నందఱను బురంబున నిలిపి వసుదేవుని శెలవును గాంచి యరణ్యమునకుఁ బోవుచు బలరాముని గనుంగొనెను. ఆతఁడు యోగంబున దేహంబుఁ బాసి దేవత్వమునందెను. కృష్ణుండు నిర్యాణసమయ మాసన్న మగుట యెఱింగిన వాఁడగుటంజేసి యేకాంతమున భూశయనుం డయ్యెను. 'జర' యను నసుర వచ్చి యొక్క బోయను బురస్కరించుకొని కృష్ణ పాదమ్మును గొక్కెరగా నతనికిఁ జూపిన నతఁడొక గాఢశరమ్ము నేసెను. అది కృష్ణ పాదమ్మునఁ జొచ్చి మోకాలినుండి వుచ్చిపోయెను. ఆ నెపమ్మునఁ గృష్ణుఁ డవతారమును జాలించి వైకుంఠవాసుఁ డయ్యెను.

### అర్జునుఁడు మృతులగు యాదవులను దహించుట.

పార్థుఁడు దారకునితో వచ్చి యాదవ స్త్రీలను వసుదేవు నూరార్చి యా రాత్రి కృష్ణమందిరమున నిద్రించెను. ఆ సమయమున వసుదేవుఁడు యోగబలంబున దేహము జాలించెను. మఱునాఁడా యాదవ కళేబరములకు నగ్ని సంస్కారంబులఁ గావించి యొక బోయవలన రామకృష్ణుల నిర్యాణమును విని కృష్ణకళేబరమును గౌఁగలించుకొని కొంతసేపు దుఃఖించి యది యంతయుఁ గాలనిర్ణయముగా నెఱింగి యాదవ స్త్రీలను గరిపురమునకుఁ బయనము నేసి యుండుతఱిని సముద్రము పొంగి ద్వారవతిని ముంచెను. కతిపయస్త్రీలను రక్షించి పంచవటమునఁ జేర్చెను. ఆరాత్రి శయనించి యుండఁగా దస్యులు వచ్చి స్త్రీధనమ్ముల నపహరించిరి. అర్జునుఁడు వారిని దలపడెను. కాని యొక్క మహాస్త్రమంత్రముగూడ స్ఫురణకు రాదయ్యె. అది దైవయోగంబుగాఁ దలఁచి స్త్రీజనంబులను బాలురను గరిపురమునఁ జేర్చి వ్యాసునివలన యుగాంతప్రభావము విని తద్వృత్తాంతమంతయును ధర్మరాజాదుల కామూలాగ్రముగా విన్నవించెను. నాటినుండియు పాండవుల మనంబులు వైరాగ్యస్థితినంది, కాలప్రభావము మాఱెనదని తెలిసినవారై రాజ్యకాంక్షకు దూరగులై యుండిరి.

ఇది మౌసలపర్వము

---

అవిఘ్నమస్తు.

# భారతసారము.

## మహాప్రస్థానిక పర్వము.

### పాండవులు రాజ్యమును జాలించుట.

ధర్మరాజు "రాజ్యభోగములను జాలించి తపోవృత్తినిఁ బూనుట యుచిత" మని నిశ్చయించుకొని పార్థునితో నాలోచించెను. అతఁడు "కాలప్రభావ మట్టిదిగాఁ దోఁచుచున్న" దని యొడంబడెను. పిదప భీమ నకుల సహదేవుల కెఱిఁగింప వారలును దలనూపిరి. అంత ధర్మజుఁడు యుయుత్సున కీ వృత్తాంత మంతయు నెఱిఁగించి యతని మహానాయకునిఁగా నియోగించి పరీక్షితునకు రాజ్యాభిషేకము గావించి యతనికిఁ రాజ్యసామ్రాజ్య పరిపాలన ప్రకారంబు లుపదేశించి కృపాచార్యునిఁ బరీక్షితునఁ కాచార్యునిగా నేర్పఱచి సుభద్రను రావించి యిట్లులనియెను. "కృష్ణసహోదరీ! మేము మనుష్యమాత్రు లనుభవింపఁదగిన కష్టమును, ద్రిదశు లనుభవింపఁదగిన సుఖములును, మున్నే రాజులును గాంచని కీర్తియును బొందితిమి:

ఇఁక నీశ్వరారాధనయే మాకు మిగిలిన కృత్యము. మనుష్యులను గుంటి సాకినట్లు నీవు మనుమని రక్షింపుము. మఱియు

మ. భవదీయాత్మజ సంభవుండు కురుభూ
భారోద్వహుండయ్యె యా
దవవంశో త్తరుఁడైన వజ్రినకు నిం
ద్రప్రస్థ రాజ్యంబు గా
రవదీప్తంబుగ నిచ్చినాఁడ సుచరి
త్రా! రక్షణీయంబు లై
నవి యీ యిందులు రెండు నీవు దృఢస్థై
ర్యం బొప్ప రక్షింపుమీ".

అని యా మహాసాధ్వి కప్పగించి పాండవులును ద్రౌపదియును నారచీరలఁ దాల్చి పురంబు వీడి చనుచుండ నొకకుశునకంబు వారివెంటనంటెను. ఉలూపియుఁ జిత్రాంగదయుఁ దమతమ స్వస్థానంబుల కరిగిరి. ఇట్లు పాండవద్రౌపదు లాఱ్వురును శునకంబును గంగానది ను త్తరించి తూర్పు మొగంబై సముద్రప్రాంతమున కేఁగిరి. అచ్చట నగ్నిదేవుండు వారలకు బ్రత్యక్షమై పార్థునిచేత నున్న గాండీవమును సముద్రమున బాఱవేయించెను. పిమ్మట వారు పశ్చిమమునకుఁదిరిగి ద్వారవతికడకు వచ్చిరి.

### పాండవ నిర్యాణము.

చ. అటసని యత్రశమంబున హి
మాచలముఁ సమతిక్రమించి వా

రటవులు భూములుఁ నదులు
నద్రములునుం గడుఁ బెక్కులంచితో
త్కట దృఢయోగసేవన ని
తాంత నిరాకుల వర్తనంబు నొం
దుట గతభేదులై కడచి
తూలక మేరు సమీపభూమికిన్.

చనునప్పుడు ద్రౌపది యోగమెడలిన భూమిపైఁ గూలెను. వృకోదరుండది చూచి "అన్నా ! ఈమె సువ్రత. దోసమెఱుఁగదు. ఈపాటు రానేల" యని ధర్మజు నడిగిన నతఁడు "పార్థునియందుఁ బక్షపాతిని యగుటం జేసి యీ దుర వస్థ సంభవించె" నని తిరిగిచూడక యేగుచుండెను. కొంత దూరమున సహదేవుఁడు వడెను. "అదేలజరిగినది" భీము డడిగిన ధర్మజుఁడు "వీఁడు తనకంటె బాజ్ఞులు లేరని గర్వించుట నిట్లయ్యె" నని చెప్పెను. పిదప నకులుఁడును నరనం దును గూడఁ గూలిరి. భీముఁడు "మహాత్మా ! కారణంబులు దెలుపు" మన ధర్మజుఁడు ఁవాయుకుమారా ! తనకంటె సుందరశరీరులు లేరను గర్వంబున నకులుండును, గౌరవ బలం బులు గదనంబునఁ దృటిలోఁగూల్తునని యట్లొనరింపమి నర్జు నుండును గూలి' రనిచెప్పుచుండ భీముఁడు తానును బడియెను. నీవు బాహుదర్పమున నెరులఁ దృణీకరించి ప్రగల్భ వచనముల నాడితి వందుచే నీకీ యవస్థకలిగినదని చెప్పి ధర్మ

జుఁడు సారమేయము వెంటరా నడుచుచుండెను. కొంత దూరము వోవుసరికి దేవేంద్రుఁడు రథము గొనివచ్చి "స్వర్గమునకు ర' మ్మని పిలిచెను. అతఁడు సారమేయమును విడిచి రాఁజాల" నని తిరస్కరించెను. ఇంద్రుఁడు ధర్మజా!

చ. జనులు నుతింపఁగా సుకృత
సంపదఁ జేసి యమర్త్య భావముం
గనియును జెంద కిట్టునికి
కార్యమె? ద్రౌపది భీమసేను న
ర్జును గవలం ద్యజించుటకు
సువ్రత! చాలితి చాలవయ్యె దీ
శునకము విడ్వవిత్తెఱఁగు
సూరిసుతుండగు నీకు నర్హమే ?"

అని యెన్ని విధముల వారించినను వినక పట్టు పట్టెను. వాని ధర్మగుణమునకు మెచ్చి సారమేయరూపమ్మున నున్న యముఁడు నిజస్వరూపమునఁ గన్పడి "నీకు సద్గతులు గలవు. మున్నే నృపులును సశరీరస్వర్గము గాంచియుండరు. నీ కీ మహాపదము సంభవించిన" దని నుతించి "రథ మెక్కు" మనిన "నా సోదరులను, ద్రౌపదినిఁ గలియుని స్వర్గము నాకు వల" దని నిరాకరించెను. "నీవు నమర్త్యభావమును బొందనుంటివి. మీవారలు వారు సేసిన కర్మానుసారముగ నానాగతులం బొందిరి. వారికై నీసౌఖ్యములఁ గోల్పవుట

యుచితము కా" దని యనేక భంగుల నయ్యిరువురు బోధించిరి. ఆ పలుకులు విని,

ఉ. "మీ రిటు లేమి సెప్పిన న
మేయభుజాబలభగ్నదైత్య! యే
గారవ మొప్పఁ దమ్ములను
గాంతను బుత్త్రుల మిత్రకోటిఁ గ
న్నారఁగఁ జూడకుండుటకు
నక్కట! యోర్తునె? యెల్లభోగముల్
వారలఁ జూచి క్రమ్మఱఁగ
వచ్చి సుఖస్థితిమై భుజించెదన్.

నా కా తెఱంగు పరమానందకరంబు అట్లు కాదేని మిమ్ము ధ్యానింపుచు నడవుల నుండెద" నని ధర్మరాజుఁడు పలికెను.

ఇది మహాప్రస్థానిక పర్వము.

—♦—

అవిఘ్నమస్తు.

# భారతసారము.

## స్వర్గారోహణపర్వము.

### ధర్మజుఁడు స్వజనంబులఁ గాంచుట.

అట్లు యుధిష్ఠిరుఁడు మిక్కిలి యాసక్తితోఁ దమ్ములను గాంతను గర్ణునిఁ జూడవలయునను కోరికఁ గాంచి యుండుట చేత నింద్రుండు తగు వారి నియోగించి యతనికిఁ గోరినట్లు స్వజనదర్శనంబు సేయింపుఁడని యానతిచ్చెను. నారదాది మునులు ధర్మనందనుని గలిసికొని కట్టెదుటనున్న సుయోధను నఁజూపిరి. అతఁడాసుయోధను మొగముఁ జూచి "యితని మొగము చూచుటచేఁ బాపముసంభవించును. వీఁడు బంధు ఘాతకుఁడు, నిష్కారణ రణము నుత్పన్నముచేసి సుక్షత్రియ వంశముల నాశనమొనరించెను. వీనితో నేమి? నా యను జాగ్రజులను బాంచాలినిఁ జూపుఁడు. వారలకు నాకలోకనివా సంబులేక తక్కెనేని నేనును వార లున్నచోటుననే యుం దును. కొనిపొం" డని వేఁడెను. వార లొక దేవదూతం గనుకొని "నీవు పోయి యితనికిఁ గర్ణాదుల జూపు"

మని పనిచెను. ధర్మజుఁ డాతనితో గలసి యమపురమున కేఁగి యచట కడు దుర్గంధయుతంబై యుండుటఁజూచి దేవదూతతో 'మనకుఁ బోవలయు చోటింక నెంత దవ్వయియుండు' నని యడిగిన నప్పురుషుఁడు

తే. గీ. ఈ నెలవును బృందార కాధీన మిదియు
మనకు రావలసినచో టనిన నతం డ
సహ్య దుర్గంధ ఘోరదర్శనత నచోటు
చిత్తమతి దుఃఖితంబుగఁ జేయుటయును.

మరలిపోవంజూచిన నయ్యెడఁ గొన్ని యెలుంగులు.

తే. గీ. "భవ్యజనన నీగాత్రంబు దివ్యసౌర
భంబు బెరసినగాడ్పు మాపైఁ గరంబు
హృద్యమై పీచుటయు దుఃఖ మెల్లఁ బాసె
భూరిసౌఖ్యంబు నొందుచున్నార మేము.

కావున దయాకలిమి 'నిట నింకఁ గొంతసేపు నిలువు' మని ప్రార్థించిరి. ధర్మజుఁడు ' మీరెవ ' రని యడిగెను. వారలు ' నేను గర్ణుండ, నేను భీముఁడ, నేనర్జునుండ, నేను నకులుండ, నేను సహదేవుఁడ నేను ద్రౌపది, ధృష్టద్యుమ్నుండ, ద్రౌపదేయుల ' మను నార్తస్వరంబులు వినఁబడెను. ధర్మజుఁడు విహ్వల చిత్తుఁడై కొంతవడి మాటలాడఁజాలక తెప్పరిలి యింద్రునిపైఁ గోపమునంది దేవదూతునితో

నీవెవ్వరివాఁడవో యచ్చటకుఁబొమ్ము. నేను వీరలనువిడిచి స్వర్గ సౌఖ్యంబుల నొల్లమి నిచటనే యుందునని చెప్పు' మని పుత్తెంచిన నతఁడేగి సవిస్తరముగ నింద్రునకు వచించెను.

ఇంద్రుండు ధర్మజునికడకు వచ్చుట.

దూతవచనమ్ములు సెవులసోఁకిన తోడనే యింద్రుండు మునులను దేవతలను వెంటఁగొని ధర్మజుని యొద్దకు వచ్చెను. యముండును గుమారునియందుఁ గరుణాయత్తుఁడై వచ్చెను. ఇంద్ర దండధరు లా మహనీయుని గౌఁగిలించుకొని.

క. "నీవిచ్చో నునికికి ని
ద్దేవత లందఱును వగచి ధిషణాగుణ సం
భావిత! నిన్నుం దోడ్కొని
పో వచ్చినవారు గినుకఁ బో విడువ వనా

క. విను మొక్కటి సెప్పెద రా
జనువానికి నెల్లఁ దప్ప దవనీశ్వర! యె
ట్లును నారకస్థలంబుం
గనుఁగొనవలయు ౘది వేద కథితము సుమీ".

పున్నెమును బాపమును రెండును వెంబడి యుండును. పాపులకు నరకమును బుణ్యులకు స్వర్గమును నియమింపఁ బడినవి అధికపాపులు మున్ను స్వర్గ మనుభవించి పిదప శాశ్వత నారకవాసు లగుదురు. అధికపుణ్యులు మున్ను నారక మనుభవించిన పిదప శాశ్వత స్వర్గ సుఖము లనుభవించెదరు.

క. ఇట యేను నిన్నుఁ బుత్రం
చుట యుత్తరకాలదివ్య సుఖసంగమ సం
ఘటనకుఁ గాదే నీకట
కటఁబఘటకు దీనిఁ దెలుపఁగా రావలసెఁ.

కావున నీవు నీ యనుజాగ్రజ బాంధులను గాంతను గలిసి శాశ్వత దివ్యపదము ననుభవింపుము. ఇదిగో! దివిజ గంగాతటిని. ఇందుఁ గ్రుంకులిడి దివ్యతనువుం గాంచుము” అని చెప్పిరి. ధర్మజుఁడు గంగామజ్జన మాచరించి స్వర్గతలము సేరెను. అచట సమస్తబంధులను సోదరులను గాంధారీ ధృతరాష్ట్రులను జూచెను. పాండు మహీశుఁడు మాద్రీ కుంతీసమేతుఁడై కుమారులను జూడవచ్చెను. ఇట్లు సమస్తస్వజనదర్శనంబును స్వర్గంబునఁ జేసి ధర్మజుఁడు మహానంద భరితుఁడయ్యెను.

గ ద్య .

ఇది శ్రీ మత్కాశీనాథుని వీరమల్లయారాధ్య విరచితాష్టాదశ
పర్వస్థిత భారతకథాసార గద్య కావ్యమున
స్వర్గారోహణ పర్వంబునుసర్వంబును
సం పూ ర్ణ ము.

# భారతసారము

## కఠినపదములకు అర్థములు,

### అ

అభ్యుదయము = అభివృద్ధి
అరిగిరి = వెళ్ళిరి
అవమతి = అవమానము
అరదమ్ము = రథము
అల్లారుముద్దు = మిక్కిలిమనోజ్ఞము
అభయము = భయములేనిది
అమూల్యాభరణంబులు = వెలలేనినగలు
అరణంబు = అమ్మబిడ్డకును అల్లునకును ఇచ్చెడివస్తువులు
అపూర్వము = క్రొత్తది
అసూయ = సహించలేకుండుట
అనర్థదాయకము = నష్టము నిచ్చునది
అధర్మవిజిత = ధర్మ విరుద్ధముగా జయింపఁబడినది
అక్షయవస్త్రదానము = తరుగని వస్త్రముల నిచ్చుట
అజాతశత్రువు = విరోధులుగలుగనివా[డు
అపహృత సర్వస్వులము = అపహరింపఁబడిన సమస్తమైన ధనము గలవారము
అమృతాశి = యజ్ఞశేషమును భుజిం[చువాఁడు

అప్రమత్తులు = జాగరూకులు
అంపశయ్య = బాణములచే నిర్మింపఁబడిన పాన్పు
అరాతిపుంజమదభంజన = శత్రుసమూహముయొక్క గర్వము నడంచువాఁడా
అనలము = అగ్ని
అస్త్రసన్యాసము = బాణమును విడిచిపెట్టుట
అపాండవము = పాండవనాశనము
అవివేకము = తెలివితక్కువ
అల్పాశయులు = స్వల్పాభిప్రాయము వారు
అగ్నిసంస్కారం = దహన కృత్యము
అమరభర్త = దేవేంద్రుఁడు
అనుచితము = తగనిది
అశనంబు = ఆహారము
అనుమతంబు = ఇష్టము
అసూయ = గుణములందు దోషముల నారోపించుట
అపారశ్రీకి = గొప్పసంపదకు

అజ్ఞాతవాసము = తామున్నయునికి యితరులకుఁ దెలియనీయకుండుట

అనుజవియోగము = సోదరుని వీడియుండుట

అంతకాలయము = యమసదనము

అనుజ్ఞాతుండు = అజ్ఞనుబొందినవాడు

అనుజన్ముఁడు = తమ్ముఁడు

అరణి = త్రచ్చి నిప్పుఁబుట్టించెడు కొయ్య

అశరీరవాక్కు = ఆకాశవాణి

అబ్దములు = సంవత్సరములు

అధములు = నీచులు

అనుమతి = ఇష్టము

అప్సరోగణంబు = దేవ వేశ్యాసమూహము

అలజడి = దుఃఖము

అభిమతంబులు = ఇష్టములు

అచ్చెరువందెను = ఆశ్చర్యపడెను

అరిష్టములు = కీడులు

అద్రులు = పర్వతములు

అమర్త్యభావము = దేవత్వము

అమేయ = గొప్ప

## ఆ

ఆతంక పరచెను = విఘ్నముఁ జేసెను

ఆపద్బాంధవుఁడు = విపత్తులయందలి చుట్టము

ఆహ్వానించి = పిలిచి

ఆహవము = యుద్ధము

ఆంబికేయుఁడు = ధృతరాష్ట్రుఁడు

ఆలాపంబులు = వాక్యములు

## ఉ

ఉదగ్రసంపదఁ = గొప్పసంపదచేతను

ఉచితానుచితములు = మంచిచెడ్డలు

ఉగ్రగాఢము = భయంకరమైనము

ఉగ్రానేకపశార్దూలభయానక వనవాసము = రౌద్రమైన యేనుఁగులచేతను, పెద్దపులులచేతభయంకరమైన యడవియందునికి

ఉదంతము = వృత్తాంతము

ఉల్లంఘింపఁజాలక = త్రోసివేయలేక

ఉపాహారము = కానుక

ఉదగ్రము = భయంకరము

ఉత్పాతము = అపశకునము

## ఊ

ఊర్పు = ఉచ్ఛ్వాసము

ఊరార్చెను = ఓదార్చెను

## ఏ

ఏనుమాఱులు= ఐదు పర్యాయములు
ఏవగింపక=రోతపడక
ఏకపక్షక్షౌరము = ఒక భాగమందలి క్షౌరము
ఏకాకిని = ఒక్కఁడను

## ఐ

ఐహికాముష్మిక సుఖసాధనము=భూలోక స్వర్గలోకముల యొక్క సౌఖ్యములకు కారణభూతము

## ఒ

ఒసంగెదను = యిచ్చెదను
ఒడంబఱచి=ఒప్పుదల జేసి

## ఓ

ఓర్చి=జయించి
ఓదార్చి=ఊరార్చి
ఓర్చెదను=ఓడించెదను

## ఔ

ఔదుగఱచి=తల్లక్రిందిపెదవిని మునిపండ్లతో నొక్కి కొఱికి

## క

కనిష్ఠులు=చిన్న కొమాళ్ళు
కని=ప్రసవించిరి
కరము=మిక్కిలి
కవిసెను=కలియఁబడెను
కడఁగుడు=యత్నించుడు
కతిపయ=కొన్ని
కలగుండు=క్షోభము
కర్తవ్యము=చేయఁదగినది
కడతేర్చెను=చంపెను
కలన=యుద్ధము
కాలుఁడు=యముఁడు
కినిసి=కోపపడి [రము
కిరాతరూపము= ఎఱుకలవాని యాకా
కిశోరము=పిల్ల
కుపితుఁడు=కోపించినవాఁడు
కృపాణపాతంబు=కత్తి పడుట
కృతనిశ్చయుఁడు = నిశ్చయము చేసిన వాఁడు
కృపాణాదులు = కత్తులు మొదలయినవి
కృత్రిమము=మోసము

కదనంబు = యుద్ధము
కల్మషము = పాపము
కపోతము = గువ్వ
కనకము = బంగారము
కథితము = చెప్పబడినది
కామరూపుఁడు=ఇచ్ఛాదీనవిగ్రహుఁడు
కార్ముకము = ధనస్సు
కాతరజనంబుల చాడ్పున = భయపడిన జనులపోల్కి

ఖనకుఁడు = త్రవ్వువాఁడు

గతాసుఁడు=పోయినప్రాణములు గలవాఁడు
గజము = ఏనుఁగు
గమ్యస్థానము = వెళ్ళవలసినచోటు

ఘోషంబు = ధ్వని

[illegible] = చంపి
చతుశ్శాలాభవనము=నాలుగిండ్లు గల పెద్ద భవనము
చక్కటులు=వాక్యములు

జలాశయము = కొలను
జాలరి = చేపలబట్టువాఁడు

కృపణవృత్తి = నీచవ్యాపారము
కోల్పడిన = పోగొట్టుకొనిన
కంసారాతి = కంసుని శత్రువు శ్రీకృష్ణుఁడు
క్రూరనారాచంబులు=నొప్పింపఁ జేయు బాణములు
క్షమ = ఓర్పు
క్షయము = నాశము
క్షోణీవల్లభా = భూరమణా

## ఖ

ఖలులు = దుర్మార్గులు

## గ

గీటడగించినఁ = చంపినను
గురుప్రయోజనము = తండ్రి నిమిత్తము
గోమాయువు = నక్క

## ఘ

## చ

చిదిమిరి = చంపిరి.
చీరి = పిలిచి
చెండాడెను= ఖండించెను
చేవమిగిలి=ధైర్యమెక్కుడై

## జ

జిత్తులు=మాయలు

జగత్త్రాణపరాయణకరణధురీణుఁడు= లోక రక్షణమున, ఆసక్తి కలిగిచేయుటయందు భార మువహించువాఁడు.

జీవన్మృతులు = ప్రాణమును విడిచిన వారలు

జంబూతరువు= నేరేడు చెట్టు

జొంపములు=గుంపులు

## డ

డెప్పరము=ఆపద

## త

తత్పరుఁడు=ఆసక్తుఁడు

తమ్మిమొగ్గరంబు=పద్మవ్యూహము

తిరస్కృతుడు=అనాదరణఁజేయఁ బడినవాఁడు

తిమిరము = అంధకారము

తృణీకరించి=తిరస్కరించి

తెగటార్పనెంచి=చంపఁదలఁచి

తోయజమిత్రుఁడు=సూర్యుఁడు

## ద

దమము=క్లేశమునోర్పుట

దగ్ధము=తగలఁబడుట

దస్యులు = శత్రులు

దారలు = భార్యలు

దావానలము = కార్చిచ్చు

దివము = ఆకాశము

దుర్నయము = దుర్నీతి

దుర్ద్యూతకితవుఁడు=దుష్టజూదముచే మోసముఁ జేయువాఁడు

దుష్టచతుష్టయము=నలువురు దుష్టులు (దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, కర్ణుఁడు, శకుని)

దుర్వినయము=వినయము లేకుండుట

దుర్గంధయుతంబు = దుర్వాసనతో

## ధ

ధర్మోజయతి=ధర్మముజయించు చున్నది.

ధాత్రీతలము=భూతలము

ధనురాచార్యపుత్రుడు=ద్రోణా చార్యుని కుమారుఁడు (అశ్వత్థామ)

## న

నదీపాతము = నదిలోఁబడవేయుట

నర్తనాగారము = నాట్యశాల

నిర్జించెను = జయించెను

నిశ్చేష్టితుఁడు= మూర్ఛ నొందినవాడు

నామకరణము = పేరు పెట్టుట

నారాచములు = బాణములు

నాకలోకనివాసము=స్వర్గమందునికి

నిపుణులు=సమర్థులు

నిశాతోల్లసితకృపాణకార్ముకోద్యత కరులు=వాఁడిచేత ప్రకాశించుచున్న కత్తులచేత,విండ్లచేత యెత్తఁబడినచేతులు కలవారలు

ని...గము=అనుజ్ఞ

నికృష్టంపుజావు= నీచపుమరణము

నిశ్శేషము = అంతయు

నిర్యాణ సమయము = మరణకాలము

నియోగించి=నియమించి

నీదాసులనుగా=నీ సేవకులనుగా

నృపరిపులన్ = రాజశత్రువులను

నెపము=మిష

నెరిమాలి=నీతివిడిచి

నింగిముట్టన్ =ఆకాశమునంటునట్లుగా

## ప

పనుపున = ఆజ్ఞచేత

పరాజితులు = ఓడిపోయిన వారలు

పరాభవము = అనుమానము

పవనాత్మజుండు = భీముడు

పద్మాక... తటాకము

...ట్టుకొని ప్రాణులు

...లచేగప్పబడిన గృ...

...హుమానము పార్శ్వ...

పా... ...ర్యమునీంద్రుడు = వ్యాస మ...

పారలౌకికక్రియలు=పరలోకక్రియ

పిరుంద=వెనుక

పినాకి=ఈశ్వరుడు

పుట్టము=వస్త్రము

పుష్పవృష్టి=పూలవాన

పురికొల్పిరి = ప్రేరేపించిరి

పెనంగి = పోరాడి

పెనకువ = యుద్ధము

పేసి = మాంసపుముద్ద

పొడసూపి = ప్రత్యక్షమై

పొలికలను = యుద్ధభూమి

పొంత = ప్రక్కను

ప్రవీణులు = నిపుణులు

ప్రమాణాఖ్యవటంబున - ప్రమాణ మను పేరుగల మఱ్ఱిచెట్టునొద్ద

ప్రచ్ఛన్నము = మఱుఁగుపాటు

ప్రబోధితుఁడు= తెలియజేయఁబడినవాఁడు

ప్రాకెను = వ్యాపించెను

ప్రాణావశిష్టునిగా=ప్రాణములే మిగిలిన వానినిగా

తు మరల బ్రతికినవాఁడు
వినఁ=పంపిన
జ్య సామ్రాజ్యము = పూజించఁ
దగిన సామ్రాట్టుదనము

ప్రాభవము=దొరతనము
ప్రాంతము = సమీపము
ప్రాజ్ఞులు=తెలిసినవారు

## ఫ

ఫ పదనాంబు భోజనశుభవ్రతవృత్తు
లక్ = ఫలపవన + అంబుభో
జన శుభవ్రత వృత్తులక్ =

పండ్లు, గాలి, నీరు, వీట్లను
భుజించి మంగళకరమైన వ్ర
తములను జేసెడివారలను

## బ

బ్యారోగ్యాయుస్సుఖ పుణ్యము
లు=బలము, దార్ఢ్యము, ఆ
రోగ్యము ఆయువు, సుఖము,
పుణ్యము
=కొంగ
కళ=అస్త్రవిద్య

బాసట = సహాయము
బిలము=రంధ్రము
బెట్టిదము=గర్వము
బంధుఘాతుకుఁడు=బంధువులను
జంపువాఁడు
బవరమున=యుద్ధమందు

## భ

= పాము
రాంగన = బ్రాహ్మణ స్త్రీ

భేదిల్లగ=బ్రద్దలగునట్లుగా
భంజించి=చంపి

## మ

మదము=జెట్టిపట్టు
ాదివిజుల్ =బ్రాహ్మణులు
కంబు=తల
ము=చావు [ములు కూడుట
ర్ణవపుంగమంబు=మహాసముద్ర
మాతంగము=మదించినయేనుఁగు
యుదురు=మరణింతురు

ముష్టిఘాతంబులన్ = పిడికిటిపోటు
ముహూర్తమాత్రము=రెండు గడియ
లపర్యంతము
మున్నీరు=సముద్రము
మూసలము=రోఁకలి
ముమ్మొనజమ్ము=మూఁడుమొనలు
గలజమ్ము (తుంగ)

మహాభుజగభీషణదంష్ట్రికలపాలుసేత
యగు = గొప్పదియగు పాము
యొక్క భయంకరమైన కోరల
యొక్క స్వాధీనము జేయబడుటయు

మజ్జనము = స్నానము

మాన్యత్వము = పూజ్యత

మిన్నకుండిరి = ఊరకుండిరి

మిథ్యాప్రతిజ్ఞు(డు = ప్రతిజ్ఞాభంగము కలవా(డు

మహార్ఘ్యము = తెలిసి తెలి

మెయికొనుట = ఒప్పుకొనుట

మోపెట్టెను = ఎక్కు(బెట్టెను

మోదమంది = సంతసించిరి

మృగయాధర్మవిరోధము = వేట(గా)వారి ధర్మమునకు విరుద్ధము

మందు(డు = అనారోగ్యవంతు(డు

ముచ్చులు = దొంగలు

## య

యువతి = స్త్రీ

## ర

రయంబున = శీఘ్రంబుగా

రథ్యంబులు = రథమునకుగట్టు గుఱ్ఱములు

రణనిహతులు = యుద్ధమందుజచ్చిన వారలు

రజతము = వెండి

రాజచక్రంబు = రాజుల సమూహము

రాధేయు(డు = కర్ణుడు

రావణాపహృత = రావణునిచే నెత్తుకొని పో(బడినది

రూపుమాపు = చంపు

రోయుచు = వెదకుచు

రోషావేశు(డు = కోపముచే ఉంగని వా(డు

రోషవిషాదము = కోపముచే దుఃఖము

## ల

లెస్స = బాగు

లోచ్చు = తక్కువ

## వ

వరించి = కోరి

వల్లె = ఒప్పుదల

విడిసియుండిరి = బసచేసికొనిరి

విఘసాశి = భోజనశేషమును భుజించువా(డు

...తము = వజ్రాయుధముచేఁ గొట్టఁబడినది

...ము = మాటనిచ్చుట

... = అర్జునుఁడు

...రి = అధికము

విలువిద్య = బాణవిద్య

విశిఖి = బస

విలసత్కనక మత్స్యయంత్రము = ప్రకాశించుచున్న బంగారు మత్స్యయంత్రము

విముఖుఁడయ్యెను = వెనుకకు మరలెను

విప్రవటు వేషమున = బ్రాహ్మణ బ్రహ్మచారి వేషమున

విధివిహితము = బ్రహ్మచే విధింపఁబడి

వివృతస్వర్గద్వారము = తెఱవఁబడిన స్వర్గపు వాకిలి

విరామము = విశ్రాంతి

విచ్చేసి = వచ్చి

విస్మితాననుఁడు = సంతోషించిన ముఖము గలవాఁడు

విఘ్నకర్తలు = అంతరాయము లొనర్చు వారలు

వీరాలాపములు = పౌరుషపు మాటలు

వృక్షవైరి = చెట్లకు శత్రువు

వేద్యము = తెలియఁదగినది

వేనవేలు = అనేకములు

పొసంగదు = అనుకూలించదు

## శ

శపథము = ఒట్టు, ప్రతిజ్ఞ

శతభిన్నములు = నూఱుముక్కలు

శరణాగత రక్షణత్వము = శరణుఁ జొచ్చిన వారలను రక్షించుట

శకలములు = ముక్కలు

శమీవృక్షము = జమ్మిచెట్టు

శోకాతుర = దుఃఖముచే బాధపడునది

శౌర్యగౌరవము = శూరత్వాధిక్య.

శ్రేయంబు = మంచి

## స

సమయంబు = ఏర్పాటు

సత్కరింపుఁడు = బహూకరింపుఁడు

సర్వజగజ్జయ్య విక్రముఁడు = సమస్త లోకమునకు జయించుటకు శక్యముగాని పరాక్రమవంతుఁడు

సైగ = హస్తాదులచే జేయబడు సంజ్ఞ

సైరంధ్రి = ఇతరుల గృహమందు పువ్వులు ముడుచుట తలదువ్వుట మొదలైన పనులను జేయునది.

సహచరులు=భృత్యులు
సగణస్థానునకు=ప్రమథగణములతోఁ
గూడుకొన్న యీశ్వరునకు
సమ్యఙ్నిశ్చయత = బాగుగనిశ్చ
యింపఁబడినది
సర్వేజనాః కాంచన మాశ్రయన్తి =
సమస్తజనులు బంగారము నాశ్ర
యించుచున్నారు
సర్పదష్టుఁడు=పాముచేఁగఱవఁబడిన
వాఁడు
సమతిక్రమించి=బాగుగదాటి
సామ్రాజ్యము=సామ్రాట్టుతనము
సాత్యవతేయుని = వ్యాసుని
సారమేయము=కుక్క
సుతశతంబు = నూర్గురుకొమరులు
సురసద్మము=దేవగృహము
సూతు[illegible]రుక = తేరునడుపువాని
గృహమందు
స[illegible] స్తుతుండు = పండితులచేఁ బొగడ
బడినవాఁడు
సేనారణ్యదావానలుఁడు = సైనికు
లనెడు నడవికి అగ్నివంటివాఁ
సౌభద్రుఁడు=అభిమన్యుఁడు
సౌమ్యుఁడు=మంచివాఁడు
సంకేతస్థలము=ఏర్పాటు చేసి
చోటు
సందేశము=వార్త
సంగ్రామము=యుద్ధము
సంశప్త[illegible] మడమద్రిప్పని
స్ఫురణ=జ్ఞాపకము
స్యందనము=రథము
స్వచ్ఛంద మరణము = స్వేచ్ఛా
చావు
స్వయంవరము = కన్య తనంతట
వరించుట
స్వబలోన్నత్యము = తనబలముయొక్క
యున్నతస్థితి
స్వస్థచిత్తుడు = మనశ్చాంచల్య
లేనివాఁడు
స్వాయత్త మరణుండు = తనప్ర
ప్రకారము చావగల
స్వార్థపరాయణులు = స్వలాభపు
కోరికగలవారలు

హ

హరిణము=లేడి
హయశిక్ష = అశ్వశిక్ష
హలాయుధుఁడు=బలరాముఁడు
హాయనంబులు = సంవత్సరములు
హృదయపర్వంబు = మనస్సుకు
తోషము
హ్రదంబు = కొలను